c

# 42

మే - జూన్
2023



# కవిసంధ్య

సంపుటి - 4; సంచిక - 42; యానాం,
సంపాదకుడు : శిఖామణి
పేజీలు 64 రూ. 50/-



## త్రి.శ్రీ @60

సాహిత్య అకాడెమి
తెలుగు కన్వీనర్
సి. మృణాళిని తో ఇంటర్వ్యూ

ప్రముఖ చిత్ర కారులు
బాలి అస్తమయం

త్రిపురనేని శ్రీనివాస్

11 మే 1963 -17 ఆగస్టు 1996

"ఒకరి వెనక నడవటం చేత కాదు
నీడ కింద ఆలోచన కదలాడదు
లోపల సరస్సు ఉన్నవాడు
బయట సముద్రాల్ని సృష్టించగలడు"

CP

# కవిత్వం కావాలి కవిత్వం

- త్రిపురనేని శ్రీనివాస్



కవిత్వం కావాలి కవిత్వం
కవిత్వం కావాలి కవిత్వం
అక్షరం నిండా జలజలలాడిపోయే
కవిత్వం కావాలి కవిత్వం
ప్రజల మీదే రాయి
ప్రజలాల్లోని అగాధ గాధల మీదే
రాయి కవిత్వం రాయి
కాగితం మీంచి కన్నులోకి వెన్నులోకి
గన్నులోకి
దూసుకుపోయే కవిత్వం రాయి
అలా ఒక వాక్యం చదవగానే
శత్రువు ఠారెత్తిపోవాలి
అమాయకుడు ఆయుధమై
హోరెత్తిపోవాలి
కవిత్వం వేరు వచనం వేరు
సాదాసీదా డీలా వాక్యం రాసి
కవిత్వమని బుకాయించకు
కవిత్వాన్ని వంచించకు
వచనమై తేలిపోతావ్
కవిత్వం కావాలి కవిత్వం
అక్షరం నిండా జివజివలాడిపోయే
కవిత్వం కావాలి కవిత్వం
ఫుట్ నోట్సులు ఉన్నది కవిత్వం కాదు
అక్షరానికి అక్షరమే వివరణ
అధోజ్ఞాపికలెందుకు
చివరాఖర్న బ్రాకెట్లు పెట్టేది కవిత్వం
కాదు స్వానుభూతికి
సహానుభూతే సహజానుభూతి
కుండలీకరణా
లెందుకు
అక్కడికక్కడే వాడి గుండె చీల్చి
బూజు దులపాలి దబాయించాలి,
ధన్మని గన్నై పేలాలి కవిత్వమై
కాచుకో అనాలి
తుప్పల్ తెప్పల్ మాటల్ రాల్చి
కవిత్వమని మొరాయించకు
కవిత్వాన్ని వంచించకు
వచనమై సోలిపోతావ్
కవిత్వం కావాలి కవిత్వం
అక్షరం నిండా కువకువలాడిపోయే
కవిత్వం కావాలి కవిత్వం జ్ఞాపకాల
లోయల్ని తవ్వకు అయ్యో పాపం అనకు
సాగదీసిన సానుభూతి వాక్యాలొద్దు
జాలి జాలి ఏడుపు మొహం
డ్రామాలొద్దు
అతడి ఛాతీ మీద ధాటీగా రెండు
నమ్మకాల్ని రాయి ధైర్యంగా శౌర్యంగా
అతడొక వీరుడ్ని చెయ్ కవిత్వమై
అతడికి కాపలా కాయి
చెత్తల్ బుట్టల్ మాటల్ రాల్చి
కవిత్వమని ఘీంకరించకు
కవిత్వాన్ని వంచించకు
వచనమై పుడతావ్
కవిత్వం కావాలి కవిత్వం
అక్షరం నిండా కళకళలాడిపోయే
కవిత్వం కావాలి కవిత్వం ❊

VPVM01A104



జ్యోతిర్మయమ్ వాఙ్మయమ్
ద్వైమాసిక పత్రిక, మే-జూన్, 2023
సంపుటి: 4 సంచిక: 42

సంపాదకులు:
కళారత్న డా॥ శిఖామణి
సెల్: 9848202526
కార్యనిర్వాహక సంపాదకులు:
డా॥ వరుగు భాస్కర్ రెడ్డి
సంపాదక వర్గం:
దాట్ల దేవదానం రాజు
మధునాపంతుల సత్యనారాయణ మూర్తి
బొల్లోజు బాబా,
డా. కుంచే నాగసత్యనారాయణ
సహాయ సంపాదకులు:
ముమ్మిడి శ్రీ వీర నాగప్రసాద్ (చిన్నారి)
సి. హెచ్. రాం, అనిల్ డ్యానీ
సుంకర గోపాల్
మేనేజర్:
పొనుగుమట్ల అశోక్ కుమార్
ఫోన్: 8639270575
కవిసంధ్య
ఇంటి నెం. 2-1-043
అంబేద్కర్‌నగర్, యానాం-533 464
తూర్పు గోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్
అక్షరాలంకరణ:
ఆర్టిస్ట్ అక్బర్
డి.టి.పి. లేఅవుట్, ముద్రణ:
సంహిత గ్రాఫిక్స్, హైదరాబాద్.
Kavisandhya A/c.No:**155711100002360**
IFSC Code : **UBIN0815578**

| | |
|---|---|
| సంవత్సర చందా | రూ.300 |
| 2 సం॥రాల చందా | రూ.600 |
| 4 సం॥రాల చందా | రూ.1200 |
| 5 సం॥రాల చందా | రూ.1500 |
| విశిష్ట చందా | రూ.5000 |
| జీవిత సభ్యత్వం | రూ.10,000 |

## ఈ సంచికలో...



✦ ముఖచిత్రం: త్రిపురనేని శ్రీనివాస్
✦ బొమ్మ: బాపు ✦ కవర్ డిజైన్: ఎ. గిరిధర్

## సంపాదకీయం

# కవిత్వపు పొద్దుతిరుగుడు పువ్వు



"ఒకరి వెనుక నడవటం చేత కాదు/ నీడ కింద ఆలోచన కదలాడదు/ లోపల సరస్సులున్నవాడు / బయట సముద్రాల్ని సృష్టించగలడు" త్రిపురనేని శ్రీనివాస్ తెలుగు సాహిత్యంలో గొప్ప ప్రకంపన. పెను సంచలనం. తీరం దాటిన వాయుగుండం. ఒక వ్యక్తి ఒక కార్యకర్త తన జీవిత కాలంలో ఏమేమి పనులు చేసి చూపెట్టగలడో అంతకంటె ఎక్కువగా తన ముప్ఫైమూడేళ్ల యవ్వనంలో చేసి చూపెట్టాడు. విరసంలో కవులు లేరు, కవిత్వం లేదు అన్న మాటను అపవాదం చేస్తూ రాసిన వేళ్ల మీది కవుల్లో శ్రీనివాస్ చివరివాడు. ఆగామి వర్షాన్ని ముందుగానే పసిగట్టిన తూనీగల గుంపు శ్రీనివాస్. అందుకే గురిచూసి పాడే పాటలకు తాను పల్లవి అయ్యాడు. పాట అవర్ణం నుండి వర్ణంలోకి చిక్కనవుతున్న రసాయనిక చర్యకు లిట్మస్ టెస్ట్ చేసాడు. పుట్టకముందే దేశద్రోహుల జాబితాలో చేరిన "పుట్టుమచ్చ"ల అస్తిత్వాన్ని పసికట్టారు. అప్పటివరకూ అంతో ఇంతో మడికట్టుకు కూచున్న ప్రతికల్లో తను చేరాక అన్ని కిటికీలను తెరిచి వెలివాడ గాలులను ఆహ్వానించాడు. కాకపోతే మల్లె మొగ్గల గొడుగు వంటి దళిత సాంస్కృతిక జీవనానికి, 'కవిత్వంలో నిర్మాణ పద్ధతులు' వంటి విమర్శకు తావెక్కడిది? అప్పటికే అత్యంత ప్రజాదరణ పొందిన ఒక వారపత్రికను దళిత కవిత్వ ప్రత్యేక సంచికగా ప్రకటించడానికి అతను ఎంత గుండెలు తీసిన బంటు. ఇవన్నీ అతను త్రికరణశుద్ధిగా నమ్మాడు కనకనే యాజమాన్యాన్ని ఒప్పించి మరీ చేయగలిగాడు. ఆరోజు శ్రీనివాస్ గట్లుకొట్టిన స్త్రీ, దళిత ముస్లిం మైనారిటీవాద పంటకాల్వలు తర్వాతి కాలంలో ప్రధాన స్రవంతులై తెలుగు సాహిత్యానికి సరికొత్త పంటలను అందించాయి.

ఇవన్నీ ఒక ఎత్తు తెలుగు కవిత్వానికి సరికొత్త జవసత్వాలను అందివ్వాలని ప్రారంభించిన 'కవిత్వం ప్రచురణలు' మరొక ఎత్తు. పాతా, కొత్తా, చిన్నా పెద్దా తారతమ్యం లేకుండా శ్రీనివాస్ సంకలించిన పద్నాలుగు కవితా సంపుటాలు దేనికదే విలక్షణమైందీ విశిష్టమైనది. శ్రీనివాస్ పూనుకోకుంటే అజంతా, త్రిపుర, స్మైల్, ఖాదర్ మొహియుద్దీన్ వంటి కవుల కవిత్వం ఈనాటికీ అచ్చుకెక్కేవి కాదేమో! వీటితో

పాటు అనువాద రంగంపై కూడా శ్రీనివాస్ తన ఆనవాళ్లను బలంగా ముద్రించాడు. భోపాల్ పొయిట్రీ ఫెస్టివల్‌కు ఆంధ్రజ్యోతి ప్రతినిధిగా వెళ్ళిన శ్రీనివాస్ స్మైల్ ముఖతా, తానుకొన్ని అనువాదాలు చేసాడు. ఆ నిప్పు ప్రతీష్ నంది క్లుప్త గీతాలను 'యెక్కడైనా ఇక్కడే' పేరుతోను, దేశదేశాల కవిత్వం 'మరోవైపు' పేరుతోనూ ప్రచురించారు. ఇంతచేసీ శ్రీనివాస్ రాసింది గోదావరీ ప్రవహించులో కొన్ని కవితలు - రహస్యోద్యమం - కవితా సంపుటి. ఎంత రాసినా తనదైన సొంత ముద్రత, వ్యక్తీకరణతో, డిక్షన్‌తో అప్పటికీ ఇప్పటికీ విలక్షణంగా మిగులుతాడు శ్రీనివాస్ వెళ్ళిపోయిన తర్వాత అతని ముద్రిత అముద్రిత రచనలన్నీ 'హో' పేరుతో కవిత్వం ప్రచురణలు 15గా మిత్రులు వెలువరించారు. కవిత్వంలో శ్రీనివాస్ ఎంత పొద్దు తిరుగుడు పువ్వు కాకపోతే మహెజబీన్, శిఖామణి, గాలి నాసరరెడ్డి, కుప్పిలి పద్మ వంటి వారు తమ కావ్యాలను శ్రీనివాస్‌కి అంకితమిస్తారు. శ్రీనివాస్‌కి 'కవిసంధ్య' నీలి సలామ్! ❊

## డా. ఎన్. గోపికి భారతీయ భాషా పరిషత్తు పురస్కారం



కోల్‌కతాలోని భారతీయ భాషా పరిషద్ తెలుగులో ప్రముఖ కవి డా॥ ఎన్. గోపికి ప్రతిష్టాత్మకమైన "కృతిత్వ సమగ్ర సమ్మాన్" పురస్కారాన్ని ప్రకటించింది. ఈ మేరకు పరిషద్ అధ్యక్షురాలు డా. కుసుమ్ ఖేమాని ఒక ప్రకటనలో తెలిపారు.

డా॥ ఎన్. గోపి కేంద్రసాహిత్య అవార్డుతో పాటు పలు ప్రతిష్టత్మాక పురస్కారాలు పొందారు. పొట్టి శ్రీ రాములు తెలుగు విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులుగా, సాహిత్య అకాడెమి తెలుగు సలహా మండలి కన్వీనర్‌గా సేవలు అందించారు. తెలుగులో నానీల సృష్టికర్త అయిన గోపి పదుల సంఖ్యలో కవితా సంపుటులు ప్రచురించారు. గోపి కవిత్వం ఆంగ్లంతో పాటు అనేక భారతీయ భాషల్లోకి అనువదించబడింది. అవార్డు ప్రదానోత్సవం ఏప్రిల్ **8, 2023** సాయంత్రం **4** గం॥కు కోల్‌కతాలోని పరిషద్ సమావేశ మందిరంలో జరిగింది.

పురస్కారం కింద లక్ష రూపాయల నగదు, దుశ్శాలువా, సైటేషన్‌లను బహూకరించారు.. **2020** మార్చిలో జరగాల్సిన ఈ కార్యక్రమం కరోనా కారణంగా మూడేళ్లు ఆలస్యంగా జరిగింది. భారతీయ భాషా పరిషత్తు పురస్కారం అందుకున్న గోపికి కవి సంధ్య ఆత్మీయ అభినందనలు. ❊

ముఖపత్ర కథనం

# త్రిశ్రీ త్రిశ్రీయే

– జి. లక్ష్మీ నరసయ్య, 9849408204



వెన్నెముకున్న వ్యక్తిత్వం త్రిశ్రీది. యథేచ్ఛగా బతికిన బ్రతుకు తనది. తన కాలాన్నీ, వయసునూ మించి పరిణతి చూపగలిగిన వారిలో త్రిపురనేని శ్రీనివాస్ ఒకడు. కవిత్వం రాయడం ద్వారా, ప్రచురించడం ద్వారా 'కవిత్వం కావాలి కవిత్వం' అని ఉద్యమించడం ద్వారా తెలుగు కవిత్వ ప్రమాణాలను పెంచిన వ్యక్తి. విప్లవోద్యమాలలో పూర్తికాలం పనిచేసి అసంతృప్తితో బయటికి వచ్చిన ఉద్యమకారుడు.

"ఒకరి వెనుక నడవటం చేతకాదు/నీడకింద/ఆలోచన కదలాడదు/లోపల సరస్సులున్న వాడు/బయట సముద్రాల్ని సృష్టించగలడు/లోపల మంట ఉన్న వాడు/బయట చలి మంటల్ని రగిలించగలడు/అతడు ఎవరికీ జడవడు/ఎవరి వెనుకా నడవడు" అని ప్రకటించాడు. సంస్థలతో, పార్టీలతో, వాటి నిర్మాణాలతో పొసగక ఘర్షణపడి ఆ వేడి నుంచి వేదన నుంచీ పలికిన పలుకులివి. శ్రీనివాస్ వ్యక్తిత్వాన్ని పట్టివ్వగల వాక్యాలు.

'నాకే ఇల్లూ లేదు', 'సంతకం ఎప్పుడూ ఒకేలా చేయలేను', 'నా గుండెకు ఒక్క దేహం చాలదు' లాంటి లోతైన ఈటెల్లాంటి వాక్యాలతో కవిత్వ ప్రపంచాన్ని కలవరంలోకి నెట్టాడు. తన వ్యక్తిత్వం టెంపరమెంట్ నుంచి దూసుకొచ్చిన వ్యక్తీకరణలివి. 'పుడుతున్నారు, పెరుగుతున్నారు, చదువుతున్నారు, ఉద్యోగిస్తున్నారు, పెళ్లిచేసుకుంటున్నారు, వాళ్ళకీ పిల్లలు పుడుతున్నారు, పెరుగుతున్నారు, చదువుతున్నారు, ఉద్యోగిస్తున్నారు, పెళ్లి చేసుకుంటున్నారు, వాళ్ళకీ పిల్లలు....ఓహ్ ఏం పునరుక్తి వైభవం!

ఇదీ మన మీద త్రిశ్రీ కామెంట్. ఒకసారి ఒక మిత్రుడు నువ్వు పెళ్లెందుకు చేసుకోవని అడిగితే 'ఎవరో ఒకరికి భర్తగా ఉండటమో, ఏ పిల్లలకో తండ్రిగా ఉండి బండి నడిపించడమో నా జీవిత ధ్యేయం కాదు.' అని చెప్పాడు. అలాగే బ్రతికాడు.

సత్యాన్ని సత్యంగా అసత్యాన్ని అసత్యంగా గుర్తిస్తూ దాన్నే రాసి రాసినదాన్నే బతికాడు. అందుకే–"విధి వ్రాత ఇంకా / కంపోజ్ కాలేదు/జీవితానికి/ద్వితీయ ముద్రణ లేదు/మినహా మరేవీ లేదు" అనగలిగాడు. అగ్రకుల ప్రగతి వాదులు దళిత ఉద్యమాన్ని చూసి విస్తుపోతున్న రోజుల్లో, దానిపట్ల ఎలా స్పందించాలో తెలియక గందరగోళంలో పడినప్పుడు ఆ ఉద్యమాన్ని సొంతం చేసుకుంటూ

"యుద్ధం మనమీద కాదు మనది కూడా/ అంటరానిదాన్నే అంటుకుందాం అపూర్వంగా పరస్పరం/ ఆలోచన మీద సాము/కవిత్వం ఉభయచరం/ముగింపు బహుజనముఖం" – అని ఖరాఖండిగా చెప్పగలిగాడు త్రిపురనేని శ్రీనివాస్. బహుజనుల విమర్శ బహుజనులే కాదు ప్రగతివాదులందరూ ముందుకు తీసుకెళ్లదగిందని చెప్పి

ఊరుకోలేదు. అలా చేయలేని వాళ్ళు ప్రగతివాదులే కాదని తేల్చిపడేశాడు. 'కష్టమైన పాఠం చదవటానికి మనసొప్పని విద్యార్థులు పరీక్షలంటే కంగారు పడుతున్నార'ని ఎద్దేవా చేశాడు.

"విప్లవకర పరిణామాల్ని చూసి/బహు విప్లవకారులే/భయపడుతుంటారు/ఎందుకో ఎప్పుడూ/సాధారణంగా సామాన్యులు ఓడిపోరు" – అని ఆనాడు అనగలగటం పెద్ద సాహసమే. 'ఒకే నావకు అనేక దిక్సూచీలు'గా సాగుతున్న విప్లవాన్ని బోనులో నిలబెట్టగలగడం చాలా మందిని ఇబ్బంది పెట్టింది. 'హరి జనంలో 'హరి' మరణించాడు. అని ప్రకటించడం ద్వారా దళితవుద్యమాన్ని గుర్తించి ప్రోత్సహించాడు.

అగ్రకుల ప్రగతి వాదులు కుల నిర్మూలన పోరాటాలపట్ల తీసుకోవాల్సిన స్టాండ్‌ను సరిగా ధ్వనించగలగటం కవిగా త్రిశ్రీ సాధించిన ఘనత. అందుకే పీడిత కుల శ్రేణులు ఇతనికి ఫ్యాన్ లయ్యారు. అగ్ర కులాల దురహంకారం మీద బహుజనులు చేస్తున్న విమర్శను తమ మీది విమర్శగా పీడక కుల ప్రగతివాదులు భావించటం అన్యాయమనీ ఆ విమర్శతో తామూ గొంతు కలపటమే అసలైన ప్రగతివాదమనీ చెప్పటంలోనే ఇతని న్యాయబద్ధత ఉంది. ఇదే వాయిస్‌ను హెచ్చార్కె వినిపించాడు. సుంకిరెడ్డి నారాయణరెడ్డి వినిపించాడు. రాణీ శివశంకర శర్మ, రాంరెడ్డి లాంటి కవులూ ఈ వైఖరిని ప్రదర్శించారు. ఆ ఊపులోనే పీడక కుల ప్రగతివాద కవులు 'కాస్త సిగ్గుపడదాం' పుస్తకంలో సంకలితమయ్యారు. ఇవ్వాళ ముప్వా శ్రీనివాసరావు చేస్తున్న పనిలో, రాస్తున్న కవిత్వంలో కూడా త్రిశ్రీ continuation కనబడుతుంది నాకు.




ఇదీ తన కాలపు విప్లవోద్యమాల పట్లా, బహుజన ఉద్యమాల పట్లా కవిగా త్రిశ్రీ నిర్వర్తించిన పాత్ర. ఇక ప్రచురణ కర్తగా, ఆంధ్రజ్యోతి ఆదివారం ఎడిటర్‌గా తాను బహుజన కవులకు ఇచ్చిన చేయూతా ప్రోత్సాహం చెరిగిపోని చరిత్ర. తనూ నేనూ కలిసి పీడిత కులాల సాహిత్యం కోసం సాగించిన పోరు ఆ చరిత్రలో భాగమే.

ఈ తరం కవులకూ, యువకులకూ త్రిశ్రీ జీవితం, కవిత్వం ఆదర్శనీయం, అనుసరణీయం. కవిత్వ సింహాసనం కోసం కవులు అడ్డ దారులు తొక్కుతూ, బాకాలనీ, బాజాలనీ తయారుచేసుకునే రందిలో ఉన్న ఈ తరుణంలో త్రిశ్రీ స్మరణ inspiring నోట్‌గా పనిచేస్తుందని మీ అందరికీ తెలుసు. విత్తనాలు జల్లకుండా, నాట్లు వేయకుండా, రకరకాల తెగుళ్ళతో యుద్ధం జరపకుండా పంటను తన్నుకెళ్లాలని చూసే అవకాశవాద, అల్ప మనస్కులకు శ్రీనివాస్ సింహ స్వప్నం. అడ్డగోలు లోకంలో ఆదర్శంగా వుండేవాళ్ళంతా అడ్డగోలుగా ఎలా కనిపిస్తారో తెలియడానికి త్రిశ్రీ జీవితం, కవిత్వం గొప్ప ఆలంబన. ❋

# ఈనాటి కవుల్లో చాలా గట్టివాడు

- చేరా



త్రిపురనేని శ్రీనివాస్ ఈనాటి కవుల్లో చాలా గట్టివాడు. వాక్యపు ఒడుపూ, ప్రతీకల విలువా మెటఫర్ కిటుకూ, పోలికల ఔచిత్యమూ బాగా తెలిసినవాడు. సాల్వడార్ డాలీ మీద రాసిన కవితలో

"గడియారం మీద వాలిన ఈగ కాలాన్ని రెండు రోజులు వెనక్కి తోస్తుంది. టెలిఫోన్ తీగల్లో మనుషులే పాక్కుంటూ వస్తారు. టెలివిజన్ నుంచి చర్మం తొడుగులు బయటికొచ్చి వొదులు వొదులుగా తిరుతాయి. బొమ్మలు డాలీని కలగంటాయి"

పై విధంగా సర్రియలిజపు ధోరణిలో చేసిన దృశ్య చిత్రీకరణలో శ్రీనివాస్ ప్రతిభ గుర్తించకుండా ఉండలేం.

సంధ్యార్ణవంలో - ఇప్పుడిక్కడ భూమ్మీద పడుతున్న అంతరిక్షం నీడను చీకటి అని పిలుస్తున్నారు గానీ అంతరిక్షం వెంటాడదు.

ఇప్పుడిక్కడ రోడ్డు మీద పడుతున్న శవం నీడను కర్ఫ్యూ అని పిలుస్తున్నారుగానీ శవం వేటాడుతుంది.

అన్న ఎత్తుగడలో వాక్యాల ఒడుపు గుర్తించ దగింది. ఒక నాటి కర్ఫ్యూ విధించిన ఒక నగరాన్ని ఆవేదనతో చిత్రించాడు. ఇక్కడ కూడా సర్రియలిస్టు టెక్నిక్‌లో చేసిన దృశ్య చిత్రీకరణ సమర్థంగా అర్థవంతంగా ఉంది.

రోడ్డుమీద రోడ్డు నడుస్తున్నప్పుడు/ ఆకాశం అమాతంగా కిందపడి పొగరూపంలో/ మళ్లీ అంతరిక్షానికి వెడుతున్నప్పుడు/ అద్దం నుంచి ప్రతిబింబాలు, విడిపోతున్నప్పుడు/ సమాధిలోంచి శవం లేచినిలబడి/అమర వీరుడి బహుమతి అందు కుంటున్నప్పుడు/ఒక తరం గాయపడింది./ఒక బాధ ఉపశమించింది./ ఒక నది సముద్రంలో మునిగింది, ఒక సముద్రం తీరం దాటింది"

ఒక కర్ఫ్యూనాటి అసాధారణ పరిస్థితి గాఢతను సూచించాడు.

ఫుట్ నోట్సులున్నది కవిత్వం కాదు. చివరాఖర్న బ్రాకెట్లు పెట్టేది కవిత్వం కాదు" శ్రీనివాస్ అంటాడు గానీ, అతని కవిత్వానికే ఇవి ఎక్కువ అవసరం. ఫుట్ నోట్స్

లంటే వివరణ కోసం కాదు. సందర్భ సూచన కోసం అవసరం. ఈ సంధ్యార్ణవ సౌందర్యాని ఫుట్ నోట్సుకాకుంటే మానే ఇంకెక్కడన్నా వివరించినా బాగుండేది. సమాచారం ఎంత ఎక్కువగా దాచిపెడితే అంత గొప్ప కవిత్వమవుతుందనుకోటం అమాయకత్వం.

ప్రస్తావన వచ్చింది కాబట్టి కవిత్వం కావాలి కవిత్వం అనే ఖండిక గురించి ఒక విషయం చెప్పాలి. "కవిత్వం వేరు, వచనం వేరు" అని ఒక చోట అంటాడు. బాగుంది, కాని ఇంకోచోట ఇంకొకటి తక్కువ అనే భావాన్ని కలిగిస్తాడు.



"కవిత్వాన్ని వంచించకు/ వచనమై పుడతావ్" అని శాపం పెట్టటం అగ్నిహోత్రావధానులు "నీ ఇంట కోడి కాల్చ" అని శాపం పెట్టటం లాగుంది. అయితే వచనం మీద కామెంట్ వదిలేస్తే ఇది చాలా మంచి పొయెం మాత్రమే కాదు చాలా అవ అవసరమైనది. కవిత్వంలో శిల్పాన్ని అశ్రద్ధ చెయ్యవద్దని ఈ పద్యం బలంగా ప్రతిపాదిస్తుంది. 'ఉజ్వల నినాదం' లో గోడమీద నినాదాల్ని/ 'రోడ్డు మీద ఒంటరిగా వెళ్తున్న వీరుడ్ని దగ్గరికి పిలిచి/ తన మీద గీసిన తుపాకీని చేతిలో పెట్టి సాగనంపే ఆయుధాగారాలు" అనటం చాలా కొత్తగా ఉంది.

అట్లాగే శ్రీనివాసుకు కవిత్వాన్ని కుదించి చెప్పటం తెలుసు. ఒకే రకపు భావాన్ని వేరు వేరు వాక్యాల ద్వారా తోమి చెప్పకపోవటం ఒక గొప్ప సుగుణం. 'స్వప్న సంగీత లహరి, చూడండి. ఎంత సంక్షిప్తత ఉందో!

స్వప్నం రాత్రిపూచే పువ్వు/ నిద్ర పేజీలో నడిచే కవిత్వం/ స్వప్నం మనిషి అంతర్నేత్రం/ ఉద్యమాన్ని ఆవిష్కరించే శతఘ్నిగాత్రం/ స్వప్న విచ్ఛేదక శత్రువు జాతికి దుస్స్వప్నం / స్వప్నం స్వప్నించే తపనకు స్వప్నం.

వెంటాడుతున్న జ్ఞాపకం అనేది ఒక కొత్త ప్రయోగం. సర్రియలిస్టు ప్రోజు లాంటిది. ఒక పేజీని ఆక్రమించిన ఈ ఖండికలో పాదవిభజన, పేరాగ్రాపుల విభజన లేదు.

శ్రీనివాస్‌లో ప్రయోగశీలత ఉంది. శిల్పం మీద శ్రద్ధ ఉంది. విప్లవ దృక్పథం ఉం ది. భాషా సౌష్టవం బాగానే ఉంది. చెప్పుకోదగిన ఊహాబలం ఉంది. వీటన్నిటినీ బ్యాలెన్సు చేసుకోటం ఇంకా అలవాటు కావాలనుకుంటాను. ఇప్పటికే మహాకవిని అయ్యానను కోకుండా పరిశ్రమిస్తే గొప్ప కవి అయ్యే సూచనలు దండిగా కనిపిస్తున్నాయి.

**(ఆంధ్రజ్యోతి, చేరాతలు, 10.09.1989. కవిత్వానుభవం నుండి - సంక్షిప్తం)** ❊

# లోపల సరస్సులున్న మనిషి

- డా॥ కె. శ్రీనివాస్, 9985411077



దేవతలకు ముప్పయ్యేళ్ళ దగ్గరే వయసు ఆగిపోతుందట. త్రిపురనేని శ్రీనివాస్ రాక్షసుడే అయినా ముప్పయి మూడేళ్ళ వయసు దగ్గర ఆగిపోయాడు. ఆ తరువాత కాలం పందొమ్మిదేళ్ళ ముసలిదైపోయింది. అతనూ అతని జ్ఞాపకమూ అతని స్ఫురణా మిసమిసలాడే యవ్వనంతోనే నిలిచిపోయాయి. శ్రీనివాస్ కవిత్వం కూడా. ఇప్పుడు మరోసారి కొత్తగా త్రిశ్రీ అక్షరాలను తడుముతుంటే, మొదట తెలుస్తున్నది ఆ యవ్వనమే. అదేదో భౌతికమయినది. కాదు, జలజలలాడిపోయే జివజివ లాడిపోయే, కువకువలాడిపోయే, కళకళలాడిపోయే కవిత్వయవ్వనం.

త్రిశ్రీని తెలుగు సాహిత్యం సాగనంపలేదు. అతని ఉనికికి ముగింపు చెప్పలేదు. ఒక దిగ్భ్రాంతిలో, ఒక దుఃఖంలో కలవరపడింది. అతన్నే ఒక నినాదంగా పలవరించింది. హెూ అంటూ అతని కవిత్వాన్ని ఉచ్చాటన చేసింది. కార్యకర్తృత్వానికి కృతజ్ఞతలు చెప్పుకున్నది. అంతేతప్ప హఠాత్తుగా నిష్క్రమించిన కవిని తూకం వేసి చరిత్ర అరలో బిగించలేదు. అతని జ్ఞాపకానికి పట్టం కట్టలేదు. అతను చేసిన పనుల అర్థమేమిటో, సారమేమిటో అవగతం చేసుకోలేదు. కొనసాగింపూ జరగలేదు. ఆ అర్థంలో కూడా అతను యవ్వనంలోనే నిలిచిపోయాడు.

కవులందరికీ, సుడిగాలి జీవితం జీవించిన సామాజికులందరికీ ముగింపు కొనసాగింపు తప్పనిసరి తతంగమేమీ కాదు. నిజానికి అట్లా జరగడం ఇష్టంలేదన్నట్టు త్రిశ్రీయే సంచరించాడు. ఒకరి వెనుక నడవటం చేతకాక, ఏ యిల్లూ లేక, ఒక్క దేహం చాలని గుండెతో - సాంప్రదాయిక సాహిత్య అంత్యక్రియలను తానే నిషేధించుకున్నాడు. అర్థం కానిదంతా అనర్థమేననుకుని, ఎడంగా నడిచినవారంతా పెడవారేననుకునే రెడీమేడ్ తరాజులు మాత్రమే అర్జెంటుగా త్రిశ్రీ ఒడ్డూ పొడువూ లెక్కలు కట్టారు. అతని చేతనాస్తిత్వపు నానార్థాలను చరిత్రచలనంలో తప్ప పట్టుకోలేమని ప్రేమికులు నిస్సహాయులయ్యారు.

ఆరాధన ఎక్కువై, అంచనా వేయలేమనుకుంటాము కానీ, ఎంతటి చలచ్చంచల దీప్త లేఖినులైనా వ్యాఖ్యలకు, విశ్లేషణలకు అతీతమైనవి కావు. కాకపోతే, మేధ గవాక్షాలను ఓరగానైనా తెరచి ఉంచుకోవడం అవసరం. కొత్తగాలులకు వేసట పడకుండా, అంతిమ నిర్ధారణలకు ఆత్రపడకుండా కాసింత సహనం అవసరం. ఇప్పుడు త్రిశ్రీని అర్థం చేసుకోవాలంటే, అతని వాచకాలకు పందొమ్మిదేళ్ళ చరిత్రను జోడించాలి. అతని అనంతరం తెలుగు సమాజం సమకూర్చుకున్న అనుభవాల, జ్ఞానాల నేపథ్యంలో అతనిని చూడాలి. ఏ అక్షరానికైనా అర్థం, అపార్థం చారిత్రకమే.

ఎనభైల మధ్యలో మొదలైన త్రిశ్రీ విప్లకవిత్వానికి కొత్తడిక్షన్ని, మిలిటెంట్ వ్యక్తీకరణనీ, మొత్తం మీద నూత్న యవ్వనాన్నీ ఇవ్వాలనుకున్నాడు. ఆ ప్రయత్నంలో అతను ఒక్కడే కాడు, ఒంటరి కాదు. కానీ, కాలం అప్పటికే కొత్త ఉద్యమాలను కడుపుతో వున్నది. అసంకల్పితంగానో సంకల్పపూర్వకంగానో త్రిశ్రీ కవిత్వం కొత్త పలుకులు పలికింది. తన కవిత్వంలోని వేగాన్నీ చెళ్ళుమనిపించే కొరడాకొసలనీ కాక, ఆగామి ఉద్యమాల ప్రాతిపదికల ప్రకటనలను లోకం అధికంగా పట్టించుకున్నది. కవి రాసింది కాక, పాఠకసమాజం అర్థం చేసుకున్నదే కవిత్వార్థం అవుతుంది. కాలస్వభావంతో వెలిగిందే పతాకశీర్షిక అవుతుంది. 'నీడ వెనుక ఆలోచన కదలాడదు' - ఏ నీడ? ఎవరి నీడ? సంతకం ఒకేలా చేయలేకపోవడం ఏమిటి? పునరుక్తుల మీద, ప్రతిధ్వనుల మీద అతనికి ఎందుకంత వ్యతిరేకత? అది సవ్యంగానే అర్థం అయిందా?

త్రిపురనేని విప్లవోద్యమాన్ని ఆరాధించాడు. మరో రకంగా చెప్పాలంటే విప్లవోద్యమంలో ఉండే నిర్భీతిని, విస్ఫోట గుణాన్ని, ఉద్వేగానికి ఆచరణకు ఉండే అతి సాన్నిహిత్యాన్ని అతను ప్రేమించాడు. రహస్యాన్ని, ధిక్కారాన్ని, ఆత్మత్యాగాన్ని ప్రేమించాడు. ఉద్యమానికి తనను తాను పర్యాయం చేసుకుని మాట్లాడాడు. అదే సమయంలో అతను అనుచరత్వాన్ని, విధేయతను ఈసడించుకున్నాడు. నంగితనాన్ని, సానుభూతుల్ని ఏవగించుకున్నాడు. కవిత్వంలో కూడా రహస్యోద్యమంలో ఉండే గుణాలన్నీ ఉండాలనుకున్నాడు. తనది కాని అనుభవాలను, తాము మన స్ఫూర్తిగా నమ్మని అంశాలను ఆపాదించుకునే సహానుభూతులను అయిష్టపడ్డాడు. వ్యవస్థను వ్యతిరేకించడం అంటే వ్యవస్థీకరణను వ్యతిరేకించడం కూడా అనుకున్నాడు. కుటుంబాన్ని పెళ్ళినే కాదు, ప్రేమల వెనుక పొంచి వున్న వ్యవస్థలనూ వెక్కిరించాడు. ఏకకాలంలో ఒకర్నే ప్రేమించలేనని, తన సూర్యోదయానికి ఒక్క ఆకాశం సరిపోదని బాహుళ్యవాదాన్ని సమస్త జీవనరంగాలకూ అన్వయించాడు. తనకు అనుచరులూ విధేయులూ ఎవరూ లేకుండా చూసుకున్నాడు. స్నేహాల్లో ప్రజాస్వామ్యాన్ని ఆచరించాడు.




వ్యక్తివాద అరాచకవాద విషసాంస్కృతికవాద వ్యక్తిగా కొందరికి కనిపించిన త్రిపురనేని శ్రీనివాస్, ఉద్యమాలను వ్యతిరేకించలేదు. సాహిత్యంలో రాజకీయాంశాలను, సామాజికాంశాలను వ్యక్తం కావడాన్ని కాదనలేదు. పైగా ప్రోత్సహించాడు. ప్రచురణకర్తగా తను వేసిన పుస్తకాలలో సగం ఉద్యమాల కవిత్వం అయితే, తక్కిన సగం వ్యక్తులుగా సామాజికుల కవిత్వం, గొంతు బలపడి స్థిరపడిన ఉద్యమానికి గురిచూసి పాడేపాట) తొలిసంకలనాన్ని, వర్తమానంలో విస్తరిస్తున్న మరో అస్తిత్వ కవిత్వ ఉద్యమం చిక్కనవుతున్న దశలో (చిక్కనవుతున్న పాట) మహాసంకలనాన్ని, ఇంకొక బాధిత అస్తిత్వ వాదం తొలికేక

పెట్టినప్పుడే పుస్తకాన్ని (పుట్టుమచ్చ) ప్రచురించడం – సాహిత్యకార్యకర్తగా శ్రీనివాస్ **ఉద్యమ**వ్యక్తిత్వాన్ని ప్రస్ఫుటం చేస్తాయి. అనుయాయిత్వాన్ని, పునరుక్తిత్వాన్ని అతను ఉద్యమతత్వానికి పర్యాయపదంగా వాడలేదు. ఉద్యమావరణాల్లో వ్యాపిస్తున్న అవాంఛనీయతలకే సంకేతించాడు. విరసం నుంచి వెళ్ళిపోవలసివచ్చి, రహస్యోద్యమం పుస్తకం బయటకు వచ్చి, తనపై విప్లవ వ్యతిరేక ముద్ర విస్తరిస్తున్న సమయంలో కూడా అతను విప్లవకవిత్వం రాశాడు. ఆవేశమూ గాఢతా మమేకతా కలగలసిన విప్లవకవిత్వం ఎట్లా ఉండాలని తాను అనుకుంటాడో అట్లాగే అతను ఆ కవిత్వం రాశాడు. అతనేమిటో అర్థం చేసుకోవడానికి సాధ్యం కాకపోతే, తప్పు అతనిది కాదు.

శ్రీనివాస్ సాహిత్య జీవితాచరణ నుంచి తెలుగు సాహిత్యం, ముఖ్యంగా పురోగామి సాహిత్యం ఎంతో ప్రయోజనం పొందింది. పాతికేళ్ళ వెనుకకు వెళ్ళి చూసినప్పుడు, ఆ కాలపు మలుపులో శ్రీనివాస్ కీలకమయిన కర్తవ్యాలు నిర్వహించాడు. ఏకైక నాయకపాత్రలో ఉన్న విప్లవసాహిత్యం స్థానాన్ని బహుళ సాహిత్యవాదాలు పంచుకునే పరిణామానికి అతను ఫెసిలిటేటర్గా ఉన్నాడు. వేయి పూవులుగా వికసించగల తెలుగు కవిత్వానికి అతను తోటమాలిగా వ్యవహరించాడు. కవిత్వం నాణ్యత పెరగడానికి, నిర్భయమైన ప్రశ్నలు వెల్లువెత్తడానికి అతను సహాయపడ్డాడు. వ్యక్తి వాదులుగా, అనుభూతివాదులుగా, అస్పష్ట–సంక్లిష్ట వ్యక్తీకరణవాదులుగా పేరుపడ్డ అనేకమంది ఒంటరి సామాజికులను కవిత్వపాఠకులందరి ముందుకు తెచ్చాడు. వారి నుంచి నేర్చుకోవలసింది నేర్చుకోవలసిందేనని తాను స్వయంగా అజంతా ప్రభావంలో పడి మరీ చెప్పాడు.

కవిత్వం అతని దృష్టిలో 'అక్షరఖచిత భాష'. పొదగడం తప్ప అతను పూసగుచ్చలేదు, పోగుపెట్టలేదు. ద్రాక్ష విత్తనాన్ని తపస్వి ముత్యపు శిల్పంగా పోల్చిన గాఢత కానీ, పుస్తకం తనను తిరగేయాలని, కవిత్వం తనను రాయాలని, ఎండలు వానలకు తడిశాయని – చేసిన అనేక విలోమ ఊహలు కానీ 'రహస్యోద్యమం'లో అడుగడుగునా మనలను ఆశ్చర్యపరుస్తాయి. 'రహస్యోద్యమం' పుస్తకం వచ్చినప్పుడు – ఫెటీల్మన్న చప్పుడు. దేనినో అధిగమించినట్లు, బకాయిపడ్డ నిట్టూర్పుకు విముక్తి లభించినట్టు, కవిత్వానికి అంతకుమించి సార్ధకత ఏముంటుంది?

త్రిశ్రీ వెళ్ళిపోయాక కూడా కాలం కదులుతూనే ఉన్నది. లోకం మారుతూనే ఉన్నది. అతను ముందే చెప్పిన మాటలు అనేకం తరువాత మన నిఘంటువుల్లోకి చేరిపోయాయి. కవిత్వం కావడమే కవిత్వానికి మొదటి షరతు అని అందరం ఇప్పుడు ఒప్పుకుంటూనే ఉన్నాము. మానవ విలువల ప్రజాస్వామ్యీకరణ, జరగడం సంఘ విప్లవంలో భాగమనీ, సంఘ విప్లవానికి అవసరమనీ గుర్తిస్తూనే వున్నాము. స్త్రీ దళిత, మైనారిటీ వాదాలు తెలుగు సాహిత్యంలో అవిభాజ్య, అనివార్య పరిణామాలని చరిత్ర పుస్తకాలలో చేర్చుకున్నాము.

**(రహస్యోద్యమం కవితలకు 'మో' చేసిన అనువాదాలతో కలిపి ముద్రించిన ద్విభాషా కవితా సంకలనానికి రాసిన ముందుమాట నుండి – సంక్షిప్తం)** ❊

# రెండు దశాబ్దాల అందమైన జ్ఞాపకం - త్రి.శ్రీ.

- డా॥ శిఖామణి, 9848202526



అవి ఎనభయ్యో దశకం చివరి సంవత్సరాలు. ఆంధ్రా యూనివర్సిటీ తెలుగు శాఖలో రీసెర్చి స్కాలర్‌గా ఉన్న రోజులు. అప్పుడే 'మువ్వలచేతికర్ర' కవితాసంపుటి వెలువడి చిన్న ప్రశంసలు, అవార్డులూ అందుకుంటున్న తరుణం. కవిత్వపు జ్వరం మాంచి కాకమీద ఉన్న కాలం. అలాంటి రోజుల్లో ఒకరోజు మా "మాస్టారు అత్తలూరి రేపు మీకొక మంచి కవిని పరిచయం చేస్తాను అన్నారు. ఈయనకి కాస్త తిక్క (ఈ మాటన్నది నేను కాదు 'మువ్వలచేతి కర్ర' ముందుమాటలో చేకూరి రామారావుగారన్నది). ఈయన పరిచయం చేసే కవి ఇంకెంత తిక్కలోడో అని స్వగతంలో అనుకున్నాను. ఆ రోజు రానే వచ్చింది. మాస్టారు గదిలో ఉండగా ఇద్దరొచ్చారు. ఈయన త్రిపురనేని శ్రీనివాస్, నా మేనల్లుడు. ఈమె వసంతలక్ష్మిగారు. ఇద్దరూ విజయవాడ 'ఉదయం'లో పనిచేస్తారు అని పరిచయం చేసారు. నా ఆశ్చర్యానికి, ఆనందానికి అంతులేదు. అంతకుముందు శ్రీనివాస్ కవితలు పత్రికల్లో చదవడమే తప్ప, ముఖతా చూసింది మాత్రం ఇదుగో ఇప్పుడే.

అప్పటికి కవుల వేషధారణ గురించి నాకో నిశ్చితాభిప్రాయం ఉండేది. కవులంటే కుర్తాతో, కొంచెం గిరజాల జుట్టుతో, మొహాన కళ్ళజోడుతో ఇలా. అంతెందుకు నేనూ అలాగే ఉండేవాణ్ణి. మోకాళ్ళ దిగువకు దిగిన లాల్చీ, భుజాన గుడ్డసంచీతో! కానీ శ్రీనివాస్‌ను చూస్తే అవన్నీ పటాపంచలైపోయాయి. రంగురంగుల పూల బుష్ షర్టుతో, తెల్లని మొహం మీద నల్ల కళ్ళద్దాలతో, చెదిరి నుదిటిమీదకు వేలాడుతున్న ముంగురులతో, ఎవరో పరదేశీ కవి నాముందు కొచ్చినట్టు ఫీలయ్యాను. షరా మామూలుగా మాస్టారుతో కలిసి చెట్టుకింది టీకొట్టు దగ్గర వేడివేడి టీ తాగి, గుండెల నిండా వెచ్చటి పొగ పీలుస్తూ కవిత్వం కబుర్లలో పడ్డాం. అలా మొదలైన పరిచయం అనతికాలంలోనే ఏకవచన సంబోధనకు చేరింది. ఆ తర్వాత అనిపించింది అత్తలూరి మేనల్లుడు ఇలాకాక మరెలా ఉంటాడని 'అదికాదు శిఖామణే' అంటూ తిరుపతి యాసలో శ్రీనివాస్ పలకరిస్తుంటే 'జననాంతర సౌహృదాని' లాంటి భావమేదో కలిగేది. సంబోధనలోని చివరి అక్షరం మీద ఏత్వం వచ్చి కూచుని ఆ పిలుపు వింతగా వినిపించేది.

అతను విజయవాడలో ఉండగా ఒకసారి ప్రసాదమూర్తి, నేను వెళ్ళాం అతని దగ్గరికి. అది వసంత బాలగోపాల్‌గార్ల ఇల్లు. సాయంత్రం టీ తాగి మీటింగ్ కని రోడ్డుమీదకొచ్చాం. ఒక కారువాడు పక్కనుండి రయ్యిన పోతూ నా తెల్లని లాల్చీ మీద ఇంత బురదజల్లి పోయాడు. వెంటనే శ్రీనివాస్ ఇంటికి తీసుకెళ్ళి తన చొక్కా ఇచ్చాడు.

అది వేసుకుని ఇప్పుడైనా మంచి కవిత్వం వొచ్చుద్దేమో అన్నాను సరదాగా. కవులకు అదొక ముచ్చట. అతను విజయవాడలో ఉన్నప్పుడు నేను విశాఖపట్నంలో ఉన్నాను. 91 చివర్లో హైదరాబాద్‌లో ఉద్యోగాని కొచ్చాక ఒకటి రెండుసార్లు కలుసుకున్నా, మళ్ళీ అతను హైదరాబాద్ వచ్చేసరికి నేను రాజమండ్రిలో ఉన్నాను. ఎప్పుడు కలుసుకున్నా, ఎన్నిసార్లు కలుసుకున్నా కవిత్వపు పలవరింతలు తప్ప మరో ఊసు లేదు. మధ్యలో ఉత్తరాలు! అతనిలాగే, అతని మాటతీరులాగే అతని అక్షరాలు కూడా పెద్దగా, ఎందుకో నిర్లక్ష్యంగా ఉన్నట్టు అనిపించేవి! అందులో చెప్పదలచుకున్న విషయం తప్ప ఒక్క వ్యర్థపదమూ ఉండేది కాదు.

ఇక తెలుగు సాహిత్యానికి అతను చేసిన రెండు గొప్పమేళ్ళు స్త్రీవాద, దళితవాదాలను సాహిత్య చౌరస్తాలో నిలబెట్టడం. తను పనిచేసిన కాలంలో ఆంధ్రజ్యోతి వీక్లీని మోస్ట్ రీడబిలిటీ ఉన్న పాపులర్ పత్రికగా తీర్చిదిద్దడం. కవిత్వం ప్రచురణల పేరుతో, బహుశా ఇప్పటికీ అచ్చుకెక్కేవారుకారేమో అనుకున్న కవులను అచ్చేసి వొదలడం. ముఖ్యంగా ఖాదర్ 'పుట్టుమచ్చ', ' అజంతా 'స్వప్నలిపి' త్రి.శ్రీ లేకపోతే లోకానికి అందేవి కాదేమో! భోపాల్‌లో జరిగిన వాగర్థ పొయిట్రీ ఫెస్టివల్‌కు స్మైల్ లాంటి మిత్రులతో కలిసి వెళ్ళి, ఆంధ్రజ్యోతి ద్వారా వారం వారం అనువాదాలను అందించి, తెలుగు కవులను ఆ ప్రపంచ కవితోత్సవంలో భాగస్వాములను చేశాడు. కవిత్వానువాదాలను ప్రచురించి అనువాదరంగాన్ని పరిపుష్టం చేసాడు. జి. లక్ష్మీనర్సయ్యతో ఆధునిక కవిత్వ నిర్మాణం పద్ధతులు రాయించి, తెలుగు సాహిత్య విమర్శను ఆధునికతలోకి నడిపించాడు.

ఇవన్నీ ఒక్కడు, ఒక్క జీవితకాలంలో, అదీ ముప్పై మూడేళ్ళకే చెయ్యడం సాధ్యమా అంటే, సాధ్యంచేసి చూపించాడు. ఇవన్నీ తలెత్తుకున్నవాడే చేయగలడుగానీ తలదించుకున్న వాడు కాదు. తెలుగు కవిత్వంలో తలెత్తుకు తిరిగిన కవి త్రిపురనేని శ్రీనివాస్. పరిచయాలు, స్నేహాలు అతని నిబద్ధతకు ఎప్పుడూ అడ్డు రాలేదు. దళిత సాహిత్యం అప్పుడప్పుడే వస్తున్న కాలంలో దానికి భుజంకాసిన శ్రీనివాస్ ఆదివారం ఆంధ్రజ్యోతికి నేను ఒక అనుభూతి ప్రధానమైన కవిత పంపితే, దాన్ని తిప్పి పంపుతూ, నువ్వు దళిత కవిత పంపితే అచ్చేస్తాను, ఇక ఇలాంటి కవితలు అచ్చెయ్యను అని కరాఖండిగా ఉత్తరం రాశాడు. 1991లోనే 'అశుద్ధ మానవుడు' కవిత రాసిన నాకు, దళిత కవిత్వం అపరిచితం కాదని ఉత్తరం రాస్తూ 'ఇనుప పాళీలు మొలుచుకొస్తున్నాయ్' కవిత పంపాను. దళిత కవిగా నా సెకండ్ ఇన్నింగ్స్ ప్రారంభించడానికి పరోక్ష కారకుడు శ్రీనివాసే. 1996 ఆగస్టు 17న చెప్పా పెట్టకుండా అందర్నీ వదిలి హఠాత్తుగా వెళ్ళిపోయాడు. ఎక్కడున్నా 'కవిత్వాన్ని' కనిపెట్టుకుని ఉన్నాడనే నా నమ్మకం. 1998లో అచ్చేసిన నా 'దళిత సాహిత్యతత్వం' పుస్తకాన్ని మా మిత్రత్వానికి గుర్తుగా అంకితం చేశాను.

రెండు దశాబ్దాల అందమైన జ్ఞాపకం శ్రీనివాస్. ❊

**(ఆదివారం 'ఆంధ్రజ్యోతి' 16 ఆగస్టు 2015 నుండి...)**

సంభాషణ

# సాహితీసృజన పోటీ పరీక్ష కాదు

- డా॥ సి. మృణాళిని, 9849065147

(ప్రముఖ సాహితీవేత్త డా॥ సి. మృణాళిని కేంద్ర సాహిత్య అకాడెమీ, తెలుగు సలహా మండలి కన్వీనర్‌గా నియమితులైన సందర్భంగా 'కవిసంధ్య' సంపాదకులు డా॥ శిఖామణి జరిపిన సంభాషణ)

**శి:** మృణాళిని అంటే రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి మనమరాలిగా, బాలగోపాల్ చెల్లెలిగా స్మృతిపథంలో మెదులుతారు. ఒకటి సంప్రదాయం. రెండోది విప్లవం. మీ జీవితంలో, ప్రభావాల్లో ఈ రెండిటినీ ఎలా సమన్వయపరచుకున్నారు?



**మృ:** వాళ్లిద్దరి పేర్లతో నేను అనుసంధింపబడడం చాలా గర్వకారణంగానే భావిస్తాను. అయితే నేను ఉద్దేశపూర్వకంగా వాళ్లిద్దరినీ సమన్వయించుకునే పని పెట్టుకోలేదు. నేనెప్పుడూ నాలాగా ఉండాలనుకుంటాను. ఇంకెవరినీ అనుకరించను. అనుసరించను. అది మొదటి విషయం. రెండోది, తాతగారు అందరూ అనుకునేంత సంప్రదాయవాది కారు. ఆయన వ్యాసాల్లో కూడ అక్కడక్కడా ఆయన అభ్యుదయ దృష్టి కనిపిస్తూంటుంది. అష్టవిధభోగాల్లో స్త్రీని చేర్చడాన్ని దుయ్యబట్టిన మొదటి విమర్శకుడు ఆయన. పురుషుడికి స్త్రీ భోగ్య వస్తువైతే, స్త్రీకి మాత్రం పురుషుడు భోగ్యవస్తువు ఎందుకు కాకూడదని ప్రశ్నించారు ఆయన ఒక వ్యాసంలో (సారస్వతాలోకం). మన ప్రబంధకవులందరిదీ స్త్రీల పట్ల భోగదృష్టే తప్ప, గౌరవం లేదని ఖండించారు కూడ. ఇక నిజజీవితానికి వస్తే, తన కుటుంబంలో బాలవితంతువులు తమ కాళ్లపై తాము నిలబడాలనీ, మరొకరి మీద ఆధారపడవద్దని చెప్పి, వారికి తన ఇంట్లో వసతి, భోజనం కల్పించి, సంగీతం నేర్పి, స్వీయార్జనతో బతకడానికి ఆధారం చూపిన వ్యక్తిత్వం ఆయనది.

కనక రాళ్లపల్లివారిలోనూ ఆ కాలం ప్రమాణాలతో చూస్తే విప్లవం ఉంది. ఇక బాలగోపాల్ గురించి నాకంటే ఎక్కువ అందరికీ తెలుసు. ఇకపోతే, నేనైనా, మా అక్కలు, అన్నలు అయినా, ప్రత్యేకించి బాలగోపాల్ అయినా ముందుగా నమస్కరించుకోవాల్సింది మా తల్లిదండ్రులకే. సమన్వయం అన్నది వారు మాకు చూపిన మార్గం. ఇంట్లో

కుటుంబంలో ఉండాల్సిన గౌరవాలు,ప్రేమలు, బంధాలు, కలిసి చేసుకునే సంబరాలు, ఆచారాలు అన్నిటినీ పోషిస్తూనే, ఎక్కడా కులం, మతం, లింగం, వర్గం అనే భేదాలు మాకు అంటకుండా పెంచిన ఘనత నాన్న కె.పి. శర్మదీ, అమ్మ నాగమణిదీ. ఇదంతా ఒక ఉపదేశం లాగానో, బోధన లాగానో జరిగేది కాదు. చాలా సహజంగా ఆచరణలో ఉండేది. ఇంట్లోకి ముస్లిం బంట్రోతు, క్రైస్తవ డ్రైవరు హాయిగా వచ్చేవారు. వారికి మంచినీళ్లు, ఫలహారాలు, అమ్మ, మేము ఇచ్చేవాళ్లం. ఏ రోజూ వారికి విడిగా తిండి పెట్టడం కానీ, వారి గ్లాసులు వేరుగా ఉంచడం కానీ నేనెరగను. 'నువ్వు ఆడపిల్లవి' అనే మాట మా ఇంట్లో ఏ ఆడపిల్లా ఎప్పుడూ వినలేదు. 'ఇది మన సంప్రదాయం. మన ఆచారం' అనే మాటలూ వినలేదు. డబ్బు, కులం, జండర్ అనే ప్రసక్తి ఇంట్లో వచ్చేదే కాదు. అలాంటి తల్లిదండ్రుల వారసత్వమే మా అందరిదీ. బాలగోపాల్ ది కూడా. కాకపోతే బాలగోపాల్ పంథా వేరు. ప్రాధాన్యతలు వేరు. మేధ వేరు. అతనికి అతనే సాటి. మరొక బాలగోపాల్ మా ఇంట్లోగానీ, మరో ఇంట్లోగానీ జన్మిస్తాడని నేననుకోను.

**శి: మీరు సాహిత్యంలో కథ, విమర్శ, అనువాదం, కాలమ్ ప్రక్రియలు రాశారు కదా. మీకు వాటిలో ఏది ఇష్టం? మీకు పేరు తెచ్చింది ఏది?**

**మృ:** మీరు చెప్పినవి కాక, నేను రేడియో నాటికలు, నవలికలు, పాటలు కూడ రాశాను. ఆకాశవాణి హైదరాబాద్‌కు నాటికలు రాశాను. వరల్డ్ స్పేస్ రేడియోకు ధారావాహిక నాటకాలు రాశాను. కె.ఐ. వరప్రసాదరెడ్డిగారు కోరిన మీదట, లలితగీతాలు రాశాను. 'స్వరార్చన' అనే ఆ సిడిలో పాటలన్నీ సురేఖామూర్తి పాడారు. మూడు హాస్యనవలికలు జ్యోతి, ఉదయం పత్రికల్లో అచ్చయ్యాయి. ఇప్పుడు పునర్ముద్రణ చెయ్యాలనుకుంటున్నాను. ఇక పోతే నాకేది ఇష్టం అంటే విమర్శ, కాలమ్ ఎక్కువ నచ్చుతాయి నేను రాసిన వాటిల్లో.

నాకు పేరు తెచ్చింది కూడ ఎక్కువగా నా కాలమ్సే. 'కోమలి గాంధారం' 'తాంబూలం' ఈ రెండిటికీ వచ్చిన పేరు మరి దేనికీ రాలేదు నాకు. హాస్యాన్ని, ముఖ్యంగా వ్యంగ్యాన్ని బాగా ఇష్టపడతాను. తెలుగువారికి హాస్యమంటే చిన్నచూపు. హాస్యం రాసేవాళ్లు రెండో తరగతి రచయితలుగా మనవాళ్లు పరిగణిస్తారు. అది హాస్యానికి ఉన్న శక్తి తెలీకపోవడం వల్లే. లేదా, హాస్యం రాయడం తమకు చేతకాకపోవడం వల్లే. కనక నా హాస్యరచనలన్నీ నాకిష్టం. ఒక సందర్భంలో ఓ మాట అన్నాను - ఆకలి గురించి ముళ్లపూడి రాసినంత ఏ వామపక్ష రచయితా రాయలేదని.

**శి: మీకు కవిత్వ పఠనం ఇష్టమని తెలుసు. కానీ కవిత్వ రచన వైపు ఎందుకు వెళ్లలేదు? గతంలో కవిత్వం ఏమైనా రాశారా?**

**మృ:** సొంత కవితలు ఓ మూడు, అనువాద కవితలు ఓ పదో పన్నెండో రాశాను.

మీ కవిసంధ్యలో ఇంటర్వ్యూకి బహుశా అవే నాకు అర్హతలు. మీరన్నట్లు నాకు మంచి కవిత్వం చదవడం ఇష్టం. కాకపోతే కవులంటే భయం. మీరు కవి కాబట్టి చెప్పడానికి మొహమాటంగా ఉంది కానీ, కవులు తామొక ప్రత్యేక జాతి అనుకుంటారు. వారు ఏ స్థాయి కవులైనా సరే. పైగా తాము రాసిందంతా కవిత్వమనుకునే భ్రమలు కూడ ఎక్కువ. అలా కవులపట్ల వచ్చిన విముఖతతో కవిత్వం చదవడం తగ్గించాను. ఇకపోతే నాకసలు కవిత్వం రాయడం చేతకాదు. నేను prosaic మనిషిని. మంచి కవిత్వాన్ని గుర్తించగలను కనక, నేను ఎప్పటికీ కవిని కాలేనని నాకు తెలుసు. చేతకానిది చెయ్యడం కంటే, చేతనైనది మరి కొంచెం ఎక్కువ చేయడం నయం కదా. అందుకే కథ, కాలమ్స్, అనువాదం, విమర్శలకు పరిమితమయ్యాను.



**శి: మీరు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో తులనాత్మక అధ్యయనకేంద్రంలో పని చేశారు కదా. ఇప్పుడు ఆ శాఖ మూతపడేట్టుంది**

**మృ:** అవునండీ, మూతపడింది. మనిద్దరం ఆ గూటికి చెందిన వాళ్లమే. అక్కడ చాలా నేర్చుకున్నవాళ్లమే. కనక ఆ కేంద్రం బోర్డు కూడ కనిపించకపోయేసరికి బాధనిపించింది. కాకపోతే తులనాత్మక కేంద్రం అని ఒక విభాగం ఉన్నా లేకపోయినా, ఏకసాహిత్య శాఖలో కూడ తులనాత్మక అధ్యయనాన్ని బోధించవచ్చు. పరిశోధనలు చేయించవచ్చు. ముఖ్యంగా కనీసం 24 గుర్తించబడిన భాషలున్న మన దేశంలో ఏ సాహిత్యాన్నీ ఏకాకిగా చదవడం వల్ల ప్రయోజనంలేదు. భారతీయసాహిత్య దృక్పథం అన్న కోణం నుంచి చూడ్డం అవసరమవుతుంది. ఆ పని సింగిల్ లిటరేచర్ శాఖలు కూడ చేస్తే, ఈ కేంద్రం లేని కొరత తీరుతుంది. కాకపోతే దానికి తగిన ఆచార్యులు, విద్యార్థులు కూడ అవసరం.

**శి: సాహిత్యంలో అనువాదం ప్రాధాన్యం ఏమిటి? ఇప్పుడు తెలుగులో అనువాదరంగం ఎలా ఉంది? ప్రభుత్వాలు, విశ్వవిద్యాలయాల పాత్ర ఏమిటి దీనిలో?**

**మృ:** నా పై జవాబుకు కొనసాగింపే ఈ జవాబు. భారతీయ సాహిత్యం అనగానే మనం అనువాదాల ద్వారానే ఇతర సాహిత్యాలను చదవగలం. కనక అనువాదం ప్రాధాన్యం ఎంత చెప్పినా తక్కువే. తెలుగులో అనువాదాలు పుష్కలంగా వస్తున్నాయి. దాస్తోయవ్‌స్కీని, మార్క్వెజ్ నీ, చైనా, జపాను రచయితలనూ మనం అనువదించుకుంటున్నాం. గొప్ప విషయమే. చిక్కల్లా ఏమిటంటే మనవి మరో భాషలోకి చెయ్యడంలో వెనకపడివున్నాం. ఇతర భాషల మేలిమిని మనం తెచ్చుకోవడం చాలా అవసరం. అదే సమయంలో మనవి ఇతర భాషల్లోకి వెళ్ళడం ఇంకా అవసరం. మనకు తెలుగునుంచి ఇంగ్లీషు, హిందీ, తమిళం, కన్నడం, మలయాళం భాషల్లోకి అనువదించగలిగినవారు చాలా తక్కువ మంది ఉన్నారు. వీరు బాగా పనిచేస్తున్నారు కూడా. కానీ అది చాలదు.

ఇంకా మంచి అనువాదకుల సంఖ్య పెరగాలి అన్నది ఒకటైతే, అనువాదానికి ఎంచుకునేందుకు కొన్ని ప్రమాణాలు, ఒక ప్రణాళిక కూడ ఉండాలని నేననుకుంటాను. ప్రస్తుతం కొంత యథాలాపంగా (రేండమ్ గా) జరుగుతున్నాయి అనువాదాలు. అలా కాక, ప్రణాళికాబద్ధంగా, ఎంపిక చేసిన పుస్తకాల అనువాదం జరిగితే, తెలుగులో వచ్చిన ఉత్తమ రచనలు ఇతర భాషల్లోకి వెళ్లగలుగుతాయి. ఇప్పుడు ఎవరికి నచ్చినవి వారు చేసుకుంటూ పోవడం జరుగుతోంది. దానికి ఒక వ్యవస్థ అంటూ మన దగ్గర ఏదీ లేదు. ద్రవిడ విశ్వవిద్యాలయంలో అనువాద కేంద్రం కొంతవరకూ ఈ పని చేసింది. నా ఉద్దేశంలో అన్ని ప్రధాన విశ్వవిద్యాలయాల్లోనూ ఇలాంటి అనువాద కేంద్రాలు ఉండి, కేవలం అనువాద సిద్ధాంతాలు చెప్పుకుని పరీక్షలు, సిద్ధాంతగ్రంథాలు రాయడంతో సరిపెట్టక, విద్యార్థులు, అధ్యాపకులు కలిసి అనువాదాలు కూడా చేయగలిగితే ప్రయోజనం ఉంటుంది. అలాగే అనువాదకులు, రచయితలు ఒక సమాఖ్యగా ఏర్పడి, ఒక పద్ధతిప్రకారం అనువాదాలు చేయగలిగితే బాగుంటుంది.

**శి: గతంలో జనరల్ కౌన్సిల్ సభ్యురాలిగా, ఇప్పుడు కన్వీనర్ గా మీరు సాహిత్య అకాడెమీకి సేవలందిస్తున్నారు. మీ ప్రాధాన్యతలేమిటి?**

**మృ:** సాహిత్య అకాడెమీ చేసే పనులు - సాహిత్యంలోని వివిధ అంశాలపై సదస్సులు, సమావేశాలు నిర్వహించడం, మంచి పుస్తకాలు ప్రచురించడం, రచయితలతో ముఖాముఖీలు నిర్వహించడం, సాహిత్యవిలువలను వీలైనన్ని ప్రాంతాల్లో ప్రచారం చేయడం. ఏ కన్వీనర్ కైనా ఇవే ప్రాధాన్యతలు. నాకు కూడ అవే. కాకపోతే ఇతర భాషలతో పోల్చినపుడు మనం ఎక్కడ వెనకబడివున్నామో గుర్తించి, ఆ పనులు వేగవంతం చేస్తే బాగుంటుందని భావిస్తున్నాను. పుస్తకప్రచురణలో, మన సాహిత్యాన్ని ఇతరులకు అందించే అనువాద రంగంలో, డాక్యుమెంటరీ తయారీలో మనం వెనకబడివున్నామని అనుకుంటున్నాను. వాటి మీద దృష్టిపెట్టడం అవసరమని భావిస్తున్నాను. తక్కిన కార్యకలాపాలు ఎలాగూ జరుగుతాయి. పైగా సాహిత్య అకాడెమీ పనులు సంఘటిత కృషి ద్వారా జరుగుతాయి. జనరల్ కౌన్సిల్‌లో డా. ఎస్వీ సత్యనారాయణగారు, మందలపర్తి కిశోర్ గారు, ప్రసేన్ గారు ఉన్నారు. అలాగే సలహామండలిలో యువకులు, అనుభవజ్ఞులు సమపాళ్లలో ఉన్నారు. అందరం కలిసి, తెలుగు సాహిత్యాన్ని ఎలా ప్రచారం చెయ్యాలి, తరువాతి తరాలకు ఎలా అందించగలమన్నది చర్చించి నిర్ణయాలు తీసుకుంటాం.

**శి: గతంలో మీరు ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాల్లో పనిచేశారు. ఇప్పుడు సోషల్ మీడియాలోనూ, యూట్యూబ్ లోనూ చేస్తున్నారు. ఈ మాధ్యమాల వల్ల సాహిత్యానికి మేలు జరుగుతుందా?**

**మృ:** సాహిత్యం కొత్త తరాలవారికి అందాలంటే ఎలక్ట్రానిక్ మీడియాను ఉప యోగించుకోవడం అవసరమని నా అభిప్రాయం. ఈటీవీలో నేను 'తెలుగు-వెలుగు'-

కార్యక్రమం నిర్వహిస్తున్నపుడు, దానివల్ల బడిపిల్లలు కూడ భాషపై ఆసక్తి పెంపొందించుకోవడం నాకు తెలుసు. అందరూ కుటుంబసమేతంగా చూసే ఆ కార్యక్రమం ద్వారా ఎందరో ప్రముఖులను, తెలుగు సాహిత్యంలోని విభిన్న ప్రక్రియలను పరిచయం చేయడం వల్ల ఎక్కువమందికి భాషాసాహిత్యాలపై ఆసక్తి కలిగింది. అలాగే వరల్డ్ స్పేస్ రేడియో అనే శాటిలైట్ రేడియో ద్వారా సినిమా పాటలతో పాటు తరచు విశ్వసాహిత్యాన్ని, తెలుగు సాహిత్యాన్ని నేను, నాతో పాటు చినవీరభద్రుడు, ఎం.బి.ఎస్. ప్రసాద్ వంటి ఆర్జేలు పరిచయం చేసేవాళ్లం. దానికి దుబాయ్, కువైట్ వంటి దేశాల్లోని తెలుగువాళ్లకు, ఒరిస్సా, గుజరాత్, బెంగాల్ వంటి ఇతర రాష్ట్రాల తెలుగువాళ్ళకు తెలుగుభాషాసాహిత్యాలపై అనురక్తి కలిగిందన్నది కూడ అనుభవపూర్వకంగా తెలుసుకున్నాం. కనక ఎలక్ట్రానిక్ మీడియాను వాడుకోవడం అవసరం. ఇక ఇప్పుడు యూట్యూబ్ ఐడ్రీమ్ ఛానెల్‌లో నిర్వహిస్తున్న 'అక్షరయాత్ర' కూ నేను ఊహించిన దానికంటే ఎక్కువ స్పందనే లభిస్తోంది. ముఖ్యంగా కళాశాల విద్యార్థులు, రచనా ప్రక్రియ గురించి, రచయితల గురించి చాలా విషయాలు తెలుసుకుంటున్నామని చెబుతున్నారు. ఈనాటి యువతకు ఆ మాత్రం ఆసక్తి కలిగిస్తే, వారి నుంచి మంచి పాఠకులు, రచయితలు వస్తారన్న ఆశవుంది.



ఇక సామాజిక మాధ్యమాలంటారా? (సోషల్ మీడియా). వాటి పట్ల నాకు గౌరవం ఉంది కానీ వాటివల్ల కొన్ని నష్టాలు కూడ ఉన్నాయని నమ్ముతాను. సోషల్ మీడియా పుణ్యమాని మనకు సాహిత్య పత్రికలు లేవన్న కొరత తీరిన మాట నిజం. అందరూ తమ రచనలని పదిమందిలోకీ తీసుకువెళ్లడానికి ఫేస్‌బుక్, వాట్సాప్, బ్లాగ్ వంటివి బాగా దోహదం చేస్తున్నాయి. అది మంచి పరిణామమే. కానీ దాని వల్ల మంచి సాహిత్యం ఏది అన్న విచక్షణ మాత్రం కొరవడుతోందని అనిపిస్తోంది. పరిమాణం పెరిగినంత మాత్రాన ప్రమాణాలు పెరిగినట్టు కాదు కదా. ఎక్కువగా సోషల్ మీడియావల్ల క్వాంటిటీ పెరుగుతోంది. ఎవరికి వారు గొప్ప రచయితలమనుకునే ఆలోచనా విధానం కూడ పెరుగుతోంది. అస్మదీయుల పొగడ్తలు, తస్మదీయుల ఖండనలే తప్ప, నిజమైన విశ్లేషణలు, విమర్శలు జరగడం లేదు.

**శి: తెలుగులో సాహిత్య పత్రికల గురించి మీ అభిప్రాయం? కవిసంధ్య గురించి ఏమంటారు? యువతకు మీరిచ్చే సందేశం?**

**మృ:** తెలుగులో సాహిత్య పత్రికలు చాలా తక్కువ కనక మాట్లాడేందుకు ఏమీ లేదు. ఇప్పుడు సోషల్ మీడియానే పత్రిక. ఇక కవిసంధ్య గొప్ప సాహసమే. మీరు ఇన్నేళ్లుగా దీన్ని ఆపకుండా నడుపుతున్నందుకు అభినందనలు. మీరు నిర్వహిస్తున్న తీరుకూడ

బాగుంది. పాతవి కొన్నిటిని గుర్తు చేస్తున్నారు. కొత్తవి రాయిస్తున్నారు. ఇంటర్వ్యూలు వేస్తున్నారు. శతజయంతి సంచికలు తీసుకువస్తున్నారు. మొత్తంమీద మంచి కవిత్వం పట్ల అభిరుచిని పెంచుతున్నారు. ఇంత పని నిరంతరాయంగా చేయడం కష్టమే. కాకపోతే, కవిత్వానికే పరిమితమయ్యారని నా బోటి వచన ప్రేమికులకు కొంత అసంతృప్తి.

ఇక యువతకు సందేశమా? నాకంత స్థాయి లేదు. ఒక్కటి చెప్తాను. నన్ను అందరూ తిట్టుకుంటారు. ఫరవాలేదు 'రాయడం మానేసి చదవండి' ఇది నా మొదటి సలహా. రెండోది 'బాగా చదివాక, ఇంకా రాయడానికి ఉందనిపిస్తే రాయడం మొదలుపెట్టండి'. లేదనిపిస్తే కలం దించేయండి'. సాహిత్యసృజన పోటీ పరీక్ష కాదు. అందరూ రాస్తున్నారు కనక మేమూ రాయాలి అనుకోడానికి. ❋

# మహామహోపాధ్యాయ ఆచార్య రవ్వా శ్రీహరి స్మృతికి నివాళి



ప్రముఖ విద్యావేత్త, వ్యాకరణ పండితుడు ఆచార్య రవ్వా శ్రీహరి 28 ఏప్రిల్ 2023న హైదరాబాద్‌లో కాలధర్మం చెందారు. ఉమ్మడి నల్లగొండ జిల్లా వలిగొండ మండలం వెల్వర్తి గ్రామంలో 12 సెప్టెంబర్ 1943న నిరుపేద పద్మశాలి కుటుంబంలో జన్మించారు. యాదాద్రి సంస్కృత విద్యాపీఠం లోనూ, సీతారాంబాగ్ సంస్కృత కళాశాలలోనూ సంస్కృత విద్యను అభ్యసించారు. తెలుగు పండిట్ కోర్సుతో పాటు, తెలుగులో బి.ఎ., ఎం.ఎ., డాక్టరేటు సాధించారు. స్వశక్తితో కఠోర క్రమశిక్షణతో సంస్కృత, తెలుగు భాషల్లో ప్రావీణ్యం సంపాదించారు. వివేకవర్ధిని, ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాలల్లో కొన్నాళ్లు పనిచేసాక, ఉస్మానియాలో రీడర్‌గా, హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో ఆచార్యునిగా పదవీ విరమణ చేసారు. ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులుగా, తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురణల విభాగం డైరెక్టర్‌గా సేవలందించారు. శ్రీహరి నిఘంటువు, అన్నమయ్య పదకోశం, నల్లగొండ జిల్లా మాండలిక పదకోశం, వ్యాకరణ సంహిత పదకోశం వంటి గ్రంథాలు వెలువరించారు. జాషువ ఫిరదౌసి, గబ్బిలం కావ్యాలను సంస్కృతంలోకి అనువదించారు. సినారె ప్రపంచపదుల సంస్కృత అనువాదానికి కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కారం పొందాడు. తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం, ఎన్టీఆర్ పురస్కారం, చిన్నయ సూరి జాతీయ పురస్కారం వంటి పలు పురస్కారాలు పొందారు. సంస్కృత విశ్వవిద్యాలయం శ్రీహరి గారిని 'మహా మహోపాధ్యాయ' బిరుదుతో సన్మానించింది. ఆచార్య రవ్వా శ్రీహరి స్మృతికి కవిసంధ్య నివాళులు అర్పిస్తోంది. ❋

సమకాలీన భారతీయ కవిత్వం

# భారతీయాంగ్లం: ప్రీతీష్ నంది

## అనువాదం: త్రిపురనేని శ్రీనివాస్



ప్రీతీష్ నంది భారతీయాంగ్ల కవి. 15 జనవరి 1951లో బీహార్‌లోని భాగల్పూర్‌లో జన్మించారు. కలకత్తాలో ప్రెసిడెన్సీ కాలేజీ విద్యాభ్యాసం చేసారు. నంది కవి మాత్రమే కాదు. చిత్రకారుడు, జర్నలిస్టు, జంతు సంరక్షకుడు, మీడియా ప్రతినిధి, చలనచిత్ర నిర్మాత, పార్లమెంటేరియన్ ఇలా బహురంగాల్లో ఆయన ప్రతిభ విస్తరించింది. టైమ్స్ ఆఫ్ ఇండియా పబ్లిసిటీ డైరక్టర్‌గా, డైలాగ్ ఇండియా ఎడిటర్‌గా, ఇల్లస్ట్రేటెడ్ వీక్లీ, ఫిలిమ్‌ఫేర్ పత్రికల ఎడిటర్‌గా సేవలందించారు. తెలుగు విప్లవోద్యమాలతో నంది కూడా భాగస్వామి. మహోజ్వల నక్సల్బరీ పోరాట యువతరంలో కూడా నంది భాగస్వామి. నక్సల్‌బరీ ప్రేరేపిత విద్యార్థులు ఆనాడు కలకత్తా వీధుల్లో సాగించిన సాయుధ విప్లవ చర్యలలో నంది కూడా మానసిక భాగస్వామి. నక్సల్‌బరీ, శ్రీకాకుళం పోరాటాలపై ఆయన ఎన్నో కవితలు రాసారు. "Of Gods and Olivers, On Either side of Arrogance from the outer Bank of Brahmaputra" వంటి కవితా సంపుటాలు పదుల సంఖ్యలో అచ్చయ్యాయి. 1977లో ఇరవై తొమ్మిదో ఏటనే పద్మశ్రీ అవార్డు అందుకున్నారు. ఆయన కవిత్వం అనేక ప్రపంచ భాషల్లోకి అనువాదం అయింది. ఇ.ఎం. ఫాస్టర్ సాహిత్య అకాడెమీ అవార్డు, హెూమీ బాబా ఫెలోషిప్, ఇంటర్నేషనల్ హ్యూమనిటేరియన్ అవార్డు, యు.ఎస్; బంగ్లాదేశ్ లిబరేషన్ అవార్డు వంటి పలు అవార్డులు అందుకున్నారు. 1981లో శాన్ ఫ్రాన్సిస్‌కోలో జరిగిన అయివద ప్రపంచ కవుల సమ్మేళనం ఆ ఏడాది ప్రీతీష్ నందిని ఆస్థాన కవిగా ప్రకటించింది. తన సృజనాత్మక శక్తితో "క్లుప్త గీతం" అనే సరికొత్త కవితా శిల్పాన్ని ఆయన సృష్టించారు. ఆ క్లుప్త గీతాల నుండి త్రిపురనేని శ్రీనివాస్ చేసిన అనువాద కవిత్వం "యెక్కడైనా యిక్కడే" నుండి కొన్ని కవితలు. (సంపా)

### అమాయకత్వం

నీ పెదవులపై
నా పెదవులు
నిన్ను నిశ్శబ్దం చేస్తాయి
నా నాలుక జవాబులు కోరుతుంది
సుతిమెత్తగా
నువ్వు స్పర్శకు విచ్చుకుంటావు.

### సాన్నిహిత్యం

నీ కాళ్ళు
నన్ను పెనవేసుకుంటాయి
నీళ్ళులేని బావి
సూర్యుడ్ని ప్రతిఫలిస్తుంది
యిది మళ్ళీ
రతి సమయం.

## భవిష్యత్తు

మర్రిచెట్టు పక్కన ముసలి జ్యోతిష్కుడు
ఆకురాలు కాలం సూర్యుడికింద
రామచిలుక మెరుపు
అంతే,
అంతకు మించిన అద్భుతాలు
యేమున్నాయి కనుక మనకు.

## నిరసన

అలసిన బాటమీదుగా
పూరేగింపు వస్తోంది
ఆకలితో చేతి బాంబుతో
జ్ఞాపకాలతో అతడు నిరీక్షిస్తున్నాడు
గాయపడినవాడే
భూమికి వారసుడవుతాడు.

## శోధన

నీ శరీరం
నాకు స్పందిస్తుంది కనుకనే
వణుకుతున్న
నీ నదులు, ఆకాశాల దారులంట నేను
వెళతాను
నా శరీరపు చీకట్లో
నీ పెదవులు అగమ్యంగా విహరిస్తాయి
మన చుట్టూ
అనంతమైన యేకాంతం.

## గతం

యెండుటాకుల వాన
ఆకాశం




శతాబ్దాల వ్యక్తీకరణ
జ్ఞాపకాలకుజి
యీ ప్రపంచం చాలా పెద్దది.

## శ్రావ్యత

బయట,
వొక అమ్మాయి నవ్వుతోంది!
వసంతం సవ్వడి
ఆకుల్లో పచ్చదనం నింపుతోంది
లోపల!
నల్లని రాత్రి
అనంతంగా విస్తరిస్తుంది
వొకటి అర్థరహితం!
రెండు భ్రమాజనితం.

## మళ్లీ

జ్ఞాపకాలు
యేకాంత అరణ్యాలలోకి విస్తరించినట్లు
చీకటి పడుతుంది
అమాయకత్వంతో
మనం
చిన్న చిన్న తప్పులు చేస్తాం. ❋

# వేసవి ప్రత్యూష పవనం - శ్రీనివాస్

- ఇంద్రగంటి శ్రీకాంత శర్మ



ఆలోచించినా ఆహారించినా కవిత్వమే కద! సభలకీ, ఉపన్యాసాలకీ రకరకాల సాహిత్య భజన పాలీలకీ కడు దూరంగా బతికిన శ్రీనివాసంటే నా కిష్టం - కవిత్వాన్ని చేతనైనంతలో వచించడం తప్ప నిర్వచించడానికి తంటాలు పడని శ్రీనివాసంటే నా కిష్టం. శ్రీశ్రీ చెప్పినట్టు కవిత్వాన్ని అనుభవించి పలవరించగల అతని మన స్సంస్కారం నా కిష్టం. కవిత్వం సరే, జీవితాన్ని ఒక నిత్యోత్సవంగా జీవించాలనే అతని జీవన లాలని నా కిష్టం. తీర్చిదిద్దిన మంచి పద్యంలా యౌవనపు వెలుగుతో మెరిసిపోయే అతని కళ్లు, నవ్వూ నా కిష్టం. ఏ సరిహద్దుల్లోనూ, కట్టబడుల్లోనూ ఇచుడ జాలని అతని స్వతంత్ర ప్రవృత్తి నా కిష్టం.

"నా కష్ట సుఖాలకి నేనే బాధ్యుణ్ణి. ఇతరుల కిందులో ప్రవేశం లేదు" అని స్వచ్ఛంద శ్రేయోభిలాషులకు" దూరంగా నడిచిన శ్రీనివాసంటే నా కిష్టం. చాలా చిన్న వయస్సులోనే మనిషి వంటరితనపు 'అనివార్యత'ని అతను గుర్తించినంతగా బహుశా ఏ తెలుగు కవీ గుర్తించలేదేమో! (నాకు తెలియదు.) బహుశా అందుకే అతను విరసానికి దూరమై ఉంటాడు. బహుశా అందుకే అతను అజంతాకీ, మోహన్ ప్రసాద్‌కి దగ్గరై ఉంటాడు. అయితే శ్రీనివాస్ ఎరిగిన, సమర్థించుకున్న ఏకాంతం, నైరాశ్యంలోంచి పుట్టింది కాదు. అతను ఈ యావత్తు జీవితాన్ని ప్రేక్షకుల 'గ్యాలరీ'లో కూర్చుని 'ఏకాంత'ంగా గమనించదలిచా డనుకుంటాను.

కవిగా శ్రీనివాస్ స్వచ్ఛమైన కొత్త గొంతు వినిపించాడు. 'గోదావరీ ప్రవహించు' సంపుటంలో 'రహస్యోద్యమం' కవిత్వంలో, అతను తన వాక్యాలలోకి కొత్త నెత్తురు ప్రవేశపెట్టాడు.

"... మీకు తెలియకుండానే/ మీ నేత్ర భూమిలో పుప్పొడి రేణువుల్ని వెదజల్లుతాను./సుగంధ జీవన సమీరాన్నై మిమ్మల్ని చుట్టేస్తాను..." అన్నప్పుడూ -

"... హృదయ సౌందర్య తీరం కోసం అందరి కోసమూ అందరూ ఉండే ద్వీపం. కోసం నేను సముద్రాన్నై సాగుతున్నాను...." అన్నప్పుడూ, 'సరిహద్దులేని ఆకాశం నా సంతకం..' అప్పుడూ,/ "నా రక్షణ ఆయుధం ఒక్కటే అన్నప్పుడూ ధిక్కరణ...." అన్నప్పుడూ/ "రేపటి ప్రత్యూషానికి నేటి చీకటి ఒక ప్రణాళిక" అన్నప్పుడూ-, నలిగిపోయిన,

అరిగిపోయిన పాత ఇతివృత్తానికి కూడా అతను యౌవనం నూరిపోయగలడని అర్థమవుతుంది. "ఆకు పచ్చ ఫిరంగి అడవి" / "అమావాస్య పద్యంలోకి పాదం" (దొరికి పోయిన మనిషి)

"అక్షర వనాల యౌవనోద్యమం" వంటి కొత్త ఊహల్లోకి ప్రవహించగల కవనం శ్రీనివాస్. అతనికి తెలుసు "అర్ధరాత్రి ఏటవాలు క్షణాల మీద నిటారుగా నిలబడి వెన్నెల్ని మీటడం..."

అతనికి తెలుసు; రెండు స్వప్నాలు సంగమిస్తే అర్ధరాత్రులు వ్యూహాలతో వెలుగుతాయి". అతనికి తెలుసు: "తలవంచిన జీవితాలన్నీ శిలలే పోరాటంలో భాగమైనవే శిల్పాలు."

కల కనడం చేతకాని వాడు కవి కాలేడు. కవి అనే కాదు; ఏ కళనీ ఆవిష్కరించలేడు. శ్రీనివాస్ రాసిన కొద్ది సంఖ్యలో రచనలూ కలకీ, వాస్తవానికి వంతెనలు కట్టే ప్రయత్నం చేశాయి. అతనిలో పారడాక్స్ ఏమంటే అతని 'కల' సమూహాలతో ముడిపడి ఉంటే, అతని వ్యక్తిత్వంలో అస్తిత్వ వాస్తవికత ఏకాంతంతో ముడిపడి ఉంది. ఈ లక్షణం మరీ ముఖ్యంగా 'రహస్యోద్యమం' రచనల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

శ్రీనివాస్ ఎప్పుడూ 'ఏది ఉత్తమ కవిత్వం' అని అనవసరపు వాదనల్లోకి దిగడం నే నెరగను. చలం అన్నట్టు 'మనిషి చేసే అంతర్-బహిర్ యుద్ధారావమే కవిత్వం' - అని క్రమ క్రమంగా నమ్ముతూ వచ్చాడని నా కనిపించింది. అతను ఎటువంటి భావావిష్కరణం కవిత్వంగా మన్నిస్తున్నాడో తెలియాలంటే 'కవిత్వం ప్రచురణల' పేరిట అతను ప్రచురించిన కవిత్వ పుస్తకాలు గమనించాలి.

స్మైల్ 'ఒఖడే', అజంతా స్వప్నలిపి - రావిశాస్త్రి 'ఎన్నెలో ఎన్నెల' స్త్రీ వాద కవితా సంపుటి 'గురి చూసి పాడే పాట - తీసి చదవాలి.

వేసవి ప్రత్యూష పవనం వంటివాడు శ్రీనివాస్... చల్లగా, హాయిగా సోకి మండుటెండ దుఃఖాన్ని మిగిల్చి వెళ్లిపోయాడు.

చనిపోయిన ఒక మనిషిని కీర్తిస్తే "చనిపోయిన వాడి కళ్లు చారెడేసి.. 'అని కిట్టని వాళ్లు చెప్పడం రివాజు. త్రిపురనేని శ్రీనివాస్ కవిత్వపు కళ్లు బతికినప్పుడూ, జ్ఞాపకాలలోనూ కూడా చారెడేసే!...

శ్రీనివాసూ!- ఇన్ని కవిత్వపు కబుర్లు చెపుతున్న నేను నువ్వు చనిపోయావంటే చూడడానికి రాలేదు .... వస్తే నా కిష్టమైన బొమ్మల చొక్కా అబ్బాయి అక్కడ లేడు... లేడనే ఆలోచన భరించలేని అర్భకుణ్ణి - క్షమిస్తావుకదూ - ❊

# మెదడు కొసకి నిప్పులంటించాడు

- శివసాగర్



త్రిపురనేని శ్రీనివాస్ చనిపోయాడని గాంధీ హాస్పటల్‌కి వెళ్లాను. అతను చనిపోయాడు. ఎవర్ని ఓదార్చను? అక్కడ చెట్టుకింద ఒకావిడ ఏడుస్తుంది. ఆమెను ఓదార్చాను. ఏడుస్తున్న దళిత సాహిత్యోద్యమాన్ని ఓదార్చాను. శివసాగర్‌ని సత్యమూర్తిగా ఓదార్చాను.

శ్రీనివాస్ చనిపోయాడని వినగానే ఎందుకో అజంతా, సౌదా గుర్తొచ్చారు. శివసాగర్ కూడా గుర్తొచ్చాడు. ఈ ముగ్గురూ అతనికి కావలసిన వాళ్లు. అది 1988. నన్ను పీపుల్స్ వార్ నాయకత్వం పార్టీ నుండి వెలివేసింది. నన్నొక రాజకీయ అంటరానితనానికి గురిచేసింది. ఈ తిరస్కృతుడిని, బహిష్కృతుడిని చిరునవ్వుతో ఆదుకున్న వాడు శ్రీనివాస్.

ఇప్పటికీ గుర్తుంది. ఇంటర్వ్యూ ప్రారంభంలో – ఈ ముఖా ముఖీలో సత్యమూర్తే కాదు శివసాగర్ కనిపించాలన్నాడు. పార్టీ జార్గాన్‌తో ప్రజలను భయభ్రాంతులను చేయవద్దన్నాడు. ఆ ఇంటర్వ్యూ విప్లవకారుడిగా నా ఆలోచనలు ఏమిటో నన్ను పార్టీ నుండి తొలగించడానికి గల కారణాలేమిటో బొమ్మ కట్టిన ట్టు వివరించింది. ఆ బొమ్మను ఊహించింది నేనైతే, గీసిన వాడు శ్రీనివాస్. ఆ ఇంటర్వ్యూ మద్రాసు నగరానికి దూరంగా పారిశ్రామిక ప్రాంతంలో కలువ పూల చెరువు పక్క వున్న రిక్షా కార్మికుని గుడిసెలో జరిగింది. ఇంటర్వ్యూ తర్వాత వెళ్లిపోతూ 'ఇది ఇంటర్వ్యూ కాదు. ఇదొక బాంబు. దీన్ని రాష్ట్రం మీదికి విసురుతానన్నాడు. బాంబు పేలింది. అబద్ధం కుక్కచావు చచ్చింది. సత్యం పసిపాపలా నవ్వింది. విప్లవోద్యమంలోనూ, విరసంలోనూ వున్న ద్వంద్వ ప్రమాణాలు – అతనిని బయటకి నెట్టాయి. మంచే జరిగింది. ఇలాంటి మంచే నాకూ జరిగింది. 'పీపుల్స్ వార్ బయట విప్లవోద్యమం వుంది, విరసం బయట విప్లవ సాహిత్యం వుంది' అని మేమిద్దరం ఇంటర్వ్యూ చివర అనుకున్నాం. ఈ ఆర్గనైజేషన్స్‌లో ఇద్దర్నీ దెబ్బతీయలేకపోయారు. పార్టీలతో, సంఘాలతో, ఆర్గనైజేషన్‌లో శ్రీనివాస్ విశ్వాసం కోల్పోయాడు. అందుకు నేను శ్రీనివాస్‌ని తప్పుపట్టలేను. అందుకే ఇలా అన్నాడు –

"ఒకరి వెనుక నడవటం చేతకాదు/నీడ కింద ఆలోచన కదలాడదు./లోపల సరస్సులున్న మనిషి/బయట సముద్రాల్ని సృష్టిస్తాడు/ ఆకాశానికి ఆలాపన నేర్పుతాడు./ అతడు ఎవరి వెనుకా నడవడు". లోపల సరస్సులున్న మనిషి శ్రీనివాస్.

నగ్జల్బరీ యుగం తర్వాతి యుగాన్ని పసికట్టాడు. దళిత వాదానికి, స్త్రీ వాదానికి నమ్మదగిన మిత్రుడయ్యాడు. గురి చూసి పాడేడు. చిక్కనవుతున్న పాటను మేల్కొలిపాడు. పౌర పాటున అగ్రకులాల్లో పుట్టినవారు, దళిత సాహిత్యోద్యమంలో ఎందుకు ఏమీ చేయలేమని జుత్తు పీక్కునేవారు శ్రీనివాస్ నుంచి నేర్చుకోవాలి. అతడు నిశ్శబ్దంగా దళిత సాహిత్యోద్యమంతో కరచాలనం చేశాడు. దళిత రచయితలు అతన్ని సొంతం చేసుకున్నారు. అది అతని జీవితంలో సాధించిన మహావిజయం. అందుకే దళితసాహిత్యోద్యమం ఒక నమ్మదగిన మిత్రుడిని కోల్పోయింది. ఇప్పుడు నడుస్తున్న చరిత్ర పరమ చండాల చరిత్ర అని నేను రాసినప్పుడు ఆ కవిత మీద శివసాగర్ ముద్ర లేదని శివసాగర్ అభిమానులు నిజంగానే ఫీలయ్యారు. ముద్రలేని మాట కూడా నిజమే. ఇదే విషయాన్ని శ్రీనివాస్ మాట్లాడితే 'ముద్రలు చెరుపుకునే ఉద్యమం కూడా ఒకటి అవసరం' అన్నాడు. దళిత సౌందర్యశాస్త్రం గురించి ఆ రాత్రి చాలా సేపు మాట్లాడుకున్నాం.



త్రిపురనేని రామస్వామిచౌదరికి, త్రిపురనేని శ్రీనివాస్‌కి మధ్య తేడా మూడు తరాల ఆంధ్ర సామాజిక జీవితంలో సాధించిన విజయం. అతనిది శూద్రుని తిరుగుబాటు. అతను వెలివాడలో ప్రవేశించలేదు. శ్రీనివాస్ ప్రవేశించాడు. అతను సంపాదకత్వం వహించిన పత్రికలో ప్రవేశపెట్టిన వెలివాడ' యువ దళిత రచయితలకు అండగా నిలిచింది. రేపటి సామాజిక విలువల్ని ఈ రోజే ఆవిష్కరించాడు. చిన్న వయసులో పెద్ద విజయాలు సాధించాడు. అతనికి కూడా ఒక పతాకం వున్నది. ఒక ప్రణాళిక వున్నది. ఒక పొలిట్ బ్యూరో వున్నది. ఈ మూడూ వెరసి త్రిపురనేని శ్రీనివాస్. అతని లక్ష్యం రేపటి జీవితాన్ని అమలు చేయడం. అతని రణన్నినాదం, అతని జండా రంగూ నాకంటే సన్నిహితులకే తెలుస్తుంది. అతడు యాక్సిడెంట్ చనిపోయాడని విన్నప్పుడు-

"జీవితమే ఒక యాక్సిడెంట్/ మరణంలో దాని నుండి విముక్తమవుతాం" అన్న కవి మాటలు గుర్తుకొచ్చాయి. "లోపల రసాయినాలున్న మనిషి / బయట ఉత్ప్రేరితం అవుతాడు / మెదడు కొనకి నిప్పులంటిస్తాడు / అతడు సృజనకు జన్మభూమి". అవును శ్రీనివాస్ మెదడుకొనకి నిప్పులంటించాడు. ❋

# ఎప్పుడూ ఓ కొత్త సంతకం...!

- అఫ్సర్, afsartelugu@gmail.com

ఏమయ్యిందేమో! ఓ సాయంత్రం నేను ఆంధ్రజ్యోతి కార్యాలయంలోంచి బయటికి రావడంతోనే వొకతను నా ఎదుటకొచ్చి నిలబడ్డాడు. నేను తలెత్తి ఎవరా అని చూసేలోగానే 'ఐ లవ్ యూ, అఫ్సర్!" అంటూ గట్టిగా కౌగిలించేసుకుని నుదుటి మీద ముద్దు పెట్టుకున్నాడు. అపరిచిత కథనాల కథనాలనాన్నే భరించలేని నేను ఆ అపరిచితుడి స్పర్శకి చాలా ఇబ్బంది పెట్టాను. అతనే మళ్లీ 'నేను శ్రీనివాస్‌ని' అని పరిచయం చేసుకునేంతదాకా నేను మామూలుమనిషిని కాలేకపోయాను.



'గోదావరి ప్రవహించు మీద మీ విమర్శ మాకు కొత్త టానిక్. అసలేమాత్రం ఆశపడలేదు ఎవరైనా ఆ పుస్తకం మీద అలా రాస్తారని అన్నాడు శ్రీనివాస్. అతని కవిత్వంలోనే కాదు, వ్యక్తిత్వంలోనూ కొన్ని వ్యక్తీకరణలు భలే వున్నాయ్ అనుకున్నాను. అలా మాట్లాడుతూనే వున్నాడు శ్రీనివాస్. చాలా సేపటి తర్వాత నేను నాదైన కరచాలనంతో అతన్ని పలకరించి "పదండి. మా రూంకి వెళ్దాం" అంటూ నడక ప్రారంభించాం. అది మా మొదటి కలయిక.

ఈ పదేళ్ల కాలం మాకూ మా తరానికీ చాలా విలువైంది. మరిచిపోలేని దశాబ్దం. కవిత్వంలో జీవితమే కనిపించాలి, ఇంకేమీ వద్దనుకున్న తరం చాలా వాటిని ప్రతిఘటించి నిలబడ్డ తరం. జీవితాల్లో వున్న కన్నీళ్లకు ఏ రంగూ పులమవద్దని చెప్పాం. ని..ఝంగా (శ్రీనూకి ఇష్టమైన ప్రయోగం) జీవితంలో కవిత్వం వుండాలి. అంతే! ఇంకెవ్వరు ఏదన్నా, ఏమన్నా! ఈ తరంలో రాస్తున్న దాదాపు ప్రతి కవికి మల్లెనే శీను అతివాద వామపక్ష శిబిరం నుంచి వచ్చాడు. చదువుకి ఎగనామం పెట్టాడు. ఏవో చిన్నాచితకా రోజుకూలీలాంటి వుద్యోగాలే చేశాడు. తర్వాత చాలా కాలానికి గాని వాడికి వో స్థిరత్వం? ఏర్పడలేదు. కవిత్వంలా బతగ్గలననే ధీమా ఏదో వాడిలో కనిపించేది. చూస్తూండగానే అన్ని ప్రాపంచిక స్వప్నాలూ భగ్నమయ్యాయి. ప్రపంచమంతటా ప్రజాస్వామ్య పవనాలు వీస్తున్నాయి. ఇక్కడేదో జీవితం మారిపోతున్న సవ్వడి వినిపించింది, భూగోళం చటుక్కున ఎటో వొరిగిపోతున్నట్ట నిపించింది. అప్పుడు శీనూ మా అందరినీ లాక్కుపోయి ఓ హొటల్ గదిలో బంధించాడు, కృష్ణుడు, చారి, ప్రసేన్, నీలిమా గోపిచంద్, శీనూ, నేనూ ఎవరి ఆలోచనల్లో వాళ్లం బందీలమై బందిఖానాలాంటి రాజకీయ వ్యవస్థ మీద కోప్పడుతున్నాం. భావస్వేచ్ఛని కాపాడతామనే పార్టీల పెద్దలు కూడా పెత్తందారితనాన్ని

వదులుకోలేకపోవడం, ఎక్కడికక్కడ నిషేధం ఒొక్కటే అంతిమ సత్యంగా వుండిపోవడం మాలోని కొత్త రక్తాన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. గ్లాస్‌కోస్తలూ, రియాన్మెన్ స్క్వేర్‌లూ, తూర్పు యూదులూ మమ్మల్ని నిద్రపోనివ్వడం లేదు. ఆ బాధలోంచి పుట్టిన దీర్ఘశోకం – క్రితం తర్వాత! అది అయ్యాక కమ్యూనిస్టు పెత్తందారులు మా మీద బెత్తం పుచ్చుకున్నాడు. అతనికి యువతరానికీ, మధ్యతరగతి శుష్క నిరాశావాదానికి ప్రతినిధులుగా ముద్రవేసి మరిచిపోదామనుకున్నారు. కానీ అలా వాళ్లని ప్రశాంతంగా నిద్రపోనివ్వడం శీనూకి ఇష్టం లేదు. క్రితం తర్వాత నుంచి కవిత్వం ప్రచురణలు పుట్టుకొచ్చింది. అస్తిత్వవాదం పేరిటా, నిరాశావాదం పేరిటా, అభ్యుదయ వ్యతిరేకత పేరిటా సంఘాలు మరిచిపోయిన కవుల్ని, సంఘం మరిచిపోలేని కవుల్ని అచ్చేసి తెలుగులోకం మీద వొదిలాడు శీను.

అదొక ఉద్యమంగా తనే వొక సంస్థగా మారిపోయి పనిచేశాడు. కాలం మళ్లీ మారిపోయింది. మధ్యతరగతి భావజాలం సృష్టించిన అనిర్దిష్ట అస్పష్ట లోకాల నుంచి కవులు భూమార్గం పట్టారు. వొకవైపు వంటగదుల్ని ధ్వంసం చేసి సమాజంలోకి .... నడిచివస్తున్న కవయిత్రులు కనిపిస్తున్నారు. మరో వైపు నొక్కిపెట్టిన గొంతుల్ని సవరించుకుని కొత్త పాటని వెతుక్కుంటున్నారు దళితులు. ఈ రెండు మార్పుల మధ్య సామాజిక చలనాన్ని చాలా వేగంగా పసికట్టాడు శీను. వాడు ఎప్పుడూ గురితప్పలేదు. తీసుకురావడానికి శీను పడ్డ శ్రమ వృథా కాలేదు. ఇవాళ భిన్నవర్గాల నుంచి వస్తున్న స్వరాల వెనుక శీను ఆనాడు పడ్డ తపన వుంది. వాడికి తను కోరుకుంటున్న ధిక్కార స్వరాలన్నీ ఇప్పుడు తెలుగు కవిత్వాన్ని వుక్కిరిబిక్కిరి చేస్తున్న వాదాలన్నీ తన ప్రతిధ్వనులే అన్నంత ప్రేమగా హృదయానికి హత్తుకున్నాడు. తను స్వయంగా రాయకపోయినా ఇక పర్లేదన్న తృప్తిని వాటిల్లో పొందాడు. అందుకే చివరి రోజుల్లో అతని కలం కాసింత విరామాన్ని కోరుకుంది. ఎప్పుడూ రాసి రంపాన పెట్టాలన్న కోరిక వాడికి లేదు. రాయలేనప్పుడు రాయకుండా వుండడమే మంచిదనుకున్నాడు. దళిత స్త్రీవాదాలను తను ఎంత బాగా అక్కున చేర్చుకున్నాడో కవిగా వాటికి తను అంత దూరాన్ని నిలబడి మాట్లాడాడు.

వాడు దళితుడుగా, స్త్రీ పరకాయ ప్రవేశం చేసి రాయలేకపోయాడు. కాని గురి చూసిన పాట వేస్తున్నప్పుడూ, చిక్కనవుతున్న పాట అచ్చవుతున్నప్పుడూ వాడిలో ఓ రకమైన గంభీరమైన పసివాడి ఆనందం నాకు కనిపించింది. వాటికి సంబంధించిన విమర్శ పెరగాలని కోరుకుంటున్నప్పుడు వాడిలో వొక తాత్వికుడి నిబద్ధత కనిపించేది. కొత్తగా రాయలేని దేన్నీ తాను క్షమించలేకపోయాడు.

కొత్తగా రాసిన చిన్న అక్షరాన్నయినా ఆకాశమంతగా ప్రేమించాడు. సంతకం ఎప్పుడూ వొకేలా చేసేంత రొటీన్‌ని కూడా భరించలేనివాడు. సున్నితత్వం అంటే కరుగ్గా కూడా వుంటుందని చెప్పినవాడు. అరువు తెచ్చుకున్న రుణగీతాలను ఏనాడూ పాడనివాడు. ఆడినా పోరాడినా నొక్క జన్మే అన్నంత కసిగా కాలాన్ని దాచేసినవాడు. ❋

# సౌందర్యాత్మక ప్రగతి శీలుడు

- ఉషా.ఎస్. డానీ, 9010757776



త్రిపురనేని శ్రీనివాస్‌ను రెండుసార్లు కలుసుకోవడం ఎవరికీ సాధ్యంకాలేదు. ప్రతి కలయికలోన అతను కొత్తవాడే. సౌదాతో కలిసి రాసిన 'గోదావరి ప్రవహించు' కవితా సంకలనంతో శ్రీనివాస్ వెలుగులోనికొచ్చాడు. దానికి తగ్గట్లే జీవితరంగాలన్నింటిలోనూ చివరి వరకు నదిలా అందంగా నిరంతర ప్రవాహాన్ని కొనసాగించాడు. శ్రీనివాస్ సౌందర్యాత్మక ప్రగతిశీలుడు.

తెలుగునాట బ్రాహ్మణ వ్యతిరేకోద్యమానికి బీజాలు నాటిన త్రిపురనేని రామస్వామి చౌదరి కుటుంబం నాలుగోతరంలో శ్రీనివాస్ పుట్టాడు. తిరుపతిలో పెరిగాడు. కాలేజి చదువు వదిలి కవిగా మారాడు. నక్సలైటయ్యాడు. రాడికల్ విద్యార్థి సంఘంలో చురుకుగా పాల్గొన్నాడు. ప్రొఫెషనల్ రివల్యూషనరీగా నాలుగేళ్ళు అండర్ గ్రౌండ్‌లో వున్నాడు. కేసుల్ని ఎదుర్కొన్నాడు. జైలుకెళ్ళాడు. విరసంలో చేరాడు. బహిష్కరణకు గురయ్యాడు. బయటికొచ్చి పాత్రికేయుడయ్యాడు. పత్రికా సంపాదకుడయ్యాడు. స్త్రీవాద మిత్రుడయ్యాడు. దళిత సాహిత్య ప్రచార కార్యకర్త అయ్యాడు. కంప్యూటర్స్ సాఫ్ట్‌వేర్ సంస్థకు అధీకృత డీలర్ అయ్యాడు. మనిషన్నవాడు ముపయ్యావ పడిలో అమెరికాలోనూ, నలభయ్యావ పడిలో ఫారిస్‌లోనూ బతకాలన్నారు. ఆ తరువాతే ఏం చేయాలనే ప్రశ్నకు శ్రీనివాస్ సమాధానం ఏమిటో మనకు తెలియదు. అసలు, నలబై ప్లస్ జీవితాన్ని శ్రీనివాస్ ఊహించాడో లేదో కూడా మనకు తెలియదు. నలభయ్యావ పడిలో ప్రవేశించడానికి ఏడు సంవత్సరాల ముందే అతని జీవితం ముగిసింది. ఒకవిధంగా శ్రీనివాస్ ప్రొఫెట్ ఆఫ్ ప్రీ-ఫార్టీస్. శ్రీనివాస్ జీవితపు ప్రతి అడుగులోన ఒక మలుపు కనిపిస్తుంది. ఒకరి అడుగుజాడల్లో నడవడం అతనికి కుదరని పని. కనీసం తనను తాము అనుకరించుకోవడమూ శ్రీనివాస్‌కు చేత కాదు. త్రిపురనేని మధుసూదవరావు గురుకులంలో శ్రీనివాస్ ప్రాపంచిక దృక్పథాన్ని అలవర్చుకున్నాడు. మధుసూదనరావు అనుచరులకు తాత్విక గాఢతతో పాటూ అరాచకత్వమూ వుంటుంది. సానుకూల అరాచకత్వం తాత్వికంగా ప్రగతిశీలమే. ప్రధానంగా కవిగా ప్రచారం పొందడంవల్ల శ్రీనివాస్ తాత్విక ప్రగాఢత ప్రాచుర్యాన్ని పొందలేక పోయింది.

శ్రీనివాస్‌లో ప్రస్ఫుటంగా కనిపించే లక్షణం అతని సౌందర్యపిపాస. వేగుంట మోహన్ ప్రసాద్ అన్నట్టు మనిషే 'వెన్నముద్ద'. అరునూరైనా లక్ష్యాన్నిఛేదించేవారు

కొందరుంటారు. చేపట్టిన ప్రతి పనిని అందంగా సాధించేవారు బహు అరుదుగా వుంటారు. అలాంటి అరుదైన వాళ్ళలో శ్రీనివాస్ ఒకడు. రంగు రంగుల పూల డిజైన్ చొక్కాలు తొడిగి ఎనభయ్యవ దశకంలో అతను తెలుగునాట విప్లవకారుల కాస్ట్యూమ్స్ మార్చివేశాడు. తొంభయ్యవ దశకంలో తెలుగు కవితా సంకలనాల కాస్ట్యూమ్స్ మార్చివేశాడు. 'రహస్యోద్యమం' సంకలనాన్ని ఎంత అందంగా తీర్చిదిద్దాడో, 'ఆయిల్ పుల్లింగ్'పై పుస్తకాన్ని కూడా అంతే అందంగా తీర్చిదిద్దడం శ్రీనివాస్‌కు మాత్రమే సాధ్యమవుతుందేమో.

'ఓ మగ మద మృగాల్లారా' అని ఉవ్వెత్తున ఎగసిపడే ఓల్గా పురుషుడైన శ్రీనివాస్‌ను ఎంతటి మానవుడై వుండాలని ప్రశంసిస్తున్నపుడు మనకు ఆశ్చర్యంగానే వుంటుంది. అగ్రవర్ణాల అహంకారాన్ని అణిచెయ్యడానికి కత్తి దూసిన పద్మారావు అగ్రకులానికి చెందిన శ్రీనివాస్ మృతి వార్త విని విలవిల్లాడిపోతుంటే మనకు వైచిత్రి అనిపిస్తుంది. పత్రికల్ని తెలుగు డెబొవాయిర్‌గా మార్చేస్తున్నాడని విమర్శల వెదుర్కొంటున్న సంపాదకుడు ఇప్పుడు దళితం తప్ప తెలుగులో మరో సాహిత్యం లేదని శిలా శాసనాన్ని ప్రకటించేస్తే మనకు మింగుడు పడదు. సభల్ని, వాల్ రైటింగ్స్‌ని చులకన చేస్తున్నాడు. ఆరోపణలపై సంఘ బహిష్కృతుడైన వ్యక్తి దళిత కవిత్వ ప్రచారం కోసం రాష్ట్రం నలుమూలలా గ్రామ గ్రామానికీ కాలికి బలపం కట్టుకుని తిరగ్గలడని. ఎవరైనా వూహించగలరా? ఏం చెప్పినా కవిత్వంగా మాత్రమే చెప్పాలని ఒట్టేసిన కవి 'శ్లాంగ్'లో సంపాదకీయాలు రాసి అది నా ఛాయిస్ అంటే నోరు వెళ్ళబెట్టడం తప్ప మనం చేయగలిగిందేమీ లేదు. ఇదంతా అజూబాయ్. ఇలాంటి అద్భుతాలమ శ్రీనివాస్ శరపరంపరగా చేసేవాడు.

శ్రీనివాస్‌లోని అన్ని రీతులకు పెద్ద సంఖ్యలో ప్రత్యేక అభిమానులున్నారు. వాళ్ళందరూ ఒకటి కాదు. ఎవరికివారు అభిమానంతో శ్రీనివాస్‌ను తమ వాడనుకోవడం తప్పదు. శ్రీనివాస్ తమవాడు మాత్రమే అనుకోవడం అతి వ్యాప్తి దోషం. అది, శ్రీనివాస్ ఆలోచనా ధోరణిలోని ఐక్యతను (యూనిటీ ఆఫ్ థాట్) మసకబారుస్తుంది. అనుక్షణం మారడమే కాకుండా, ప్రతి క్షణం పలు నీతులుగా వ్యక్తమయ్యే మనిషికి ఒక స్వభావాన్ని నిర్ధారించడం సాధ్యమేనా? అనే తాత్విక సందేహం తలెత్తుతుంది. అలాంటి ప్రశ్నలకు సమాధానాన్ని మనం శ్రీనివాస్ అభిమానుల్లో కాకుండా, సామాజిక శాస్త్రాల్లో వెదకడం మేలు. సకల జీవవ రంగాలన్నింటిలోనూ పొడ వాటిని విధ్వంసం చేయడం శ్రీనివాస్ లక్షణం. మంచి-చెడ్డా, నీతి-అవినీతి, ప్రయోజనం-అప్రయోజనం అనే విధక్షణ అతనికి అవ వసరం. గతాన్ని విధ్వంసం చేయడమే ఒక ప్రయోజనం. గతాన్ని కూల్చేస్తే భవిష్యత్తు దానికదే పుట్టుకు వస్తుందని నమ్మేవాళ్ళలో శ్రీనివాస్ ఒకడు.

సమాజాన్ని సమస్త పీడల నుండి విముక్తి చేయాలనే లక్ష్యాలతో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీలు ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ, జాతులు, స్త్రీల ప్రాథమిక అనుభవాల పరిగణనను నిర్లక్ష్యం చేశాయి. ఆరు దళిత శ్రేణులకన్నా ముఖ్యమైన 'వర్గ' పోరాటంలో పార్టీల నాయకులు తలమునకలై వున్నారేమో మనకు తెలియదు. శ్రీనివాస్ దళితుల్ని, వాళ్ళ ప్రాథమిక అనుభవాలనూ, అనుభూతులను ప్రేమతో పట్టించుకున్నాడు. 1988 ఫిబ్రవరిలో ఉదయం దినపత్రిక 'సాహిత్యంలో మతతత్వం' వ్యాసాన్ని ప్రచురించినపుడు 'ధ్వని' పేజి ఇన్‌ఛార్జి శ్రీనివాసే. కవిత్వం 'ప్రచురణలు ఆరంభించి తొలి స్త్రీవాద కవితా సంకలనం 'గురిచూసి పాడే పాట', తొలి మైనారిటీ కవిత 'పుట్టుమచ్చ', దళిత కవుల తొలి సంకలనం 'చిక్కనవుతున్న పాట' ప్రచురించిందీ అతనే. అప్పటి వరకు నామమాత్రపు ఐక్యత కూడా లేని ఆరు దళిత శ్రేణులకు తెలుగు సాహిత్యంలో ఏర్పడిన ఒక సమైక్య వేదిక శ్రీనివాస్. ❋

**(సెప్టెంబరు 13, 1996)**

## ఓరుగల్లు సాహితీ శిఖరం 'బాలకిషన్‌రావు' మృతికి నివాళి



ఓరుగల్లుకు చెందిన సాహితీవేత్త, కవి, న్యాయవాది నమిలికొండ బాలకిషన్‌రావు **(73)** హన్మకొండలోని ప్రయివేటు హాస్పిటల్‌లో చికిత్స పొందుతూ తుది శ్వాస విడిచారు. చైతన్య సాహితీ, సాంస్కృతిక సమాఖ్య, సాహితీ సమితి, పోతన విజ్ఞాన పీఠం, కాళోజీ ఫౌండేషన్ కార్యవర్గ సభ్యులుగా, రాజరాజ నరేంద్ర భాషా నిలయంలో క్రియాశీల సభ్యునిగా విశేష సేవలు అందించారు. కరీంనగర్ జిల్లా పూదూరులో నమిలికొండ నారాయణరావు, రత్నబాయి దంపతులకు కొండ బాలకిషన్‌రావు **1950** సెప్టెంబర్ **6**న జన్మించారు. ఎంఏ, ఎల్‌ఎల్‌బీ, పట్టభద్రుడైన బాలకిషన్ హనుమకొండలో న్యాయవాద వృత్తి చేపట్టారు. వర్ధమాన రచయితలను ప్రోత్సహించాలనే ఉద్దేశంతో **1982**లో ప్రసారిక మాసపత్రికను నెలకొల్పారు. దాంతోపాటు ఆయన స్వీయ రచనలైన యువస్వరం, అక్షర చిత్రాలు, శాంతి సమత, అక్షరాల్లో అనంతం, అక్షర ప్రతిబింబం, ప్రసారకీయ కుసుమాలు వెలువరించారు. సాహితీ సమితి వేదిక ద్వారా నమిలికొండ అధ్యక్షులుగా పొట్లపల్లి శ్రీనివాసరావు కార్యదర్శిగా అనేక సభలు, సమావేశాలు, కవి సమ్మేళనాలు నిర్వహించి పుస్తక ప్రచురణలు గావించారు. బాలకిషన్ రావు మృతికి 'కవిసంధ్య' నివాళులు అర్పిస్తోంది. ❋

# త్రిపురనేని శ్రీనివాస్ - ఆ సాహసికి మందారపూల వందనాలు

**- కుప్పిలి పద్మ, 9866316174**



నా హృదయం మీద చెరగని సంతకం చేసినవాడు. ఆధునిక కవితాకాశంలో పూర్ణచంద్రుని వలె వెలుగొందినవాడు. యీ నేల మీద వొకనాటి వుద్యమకారుడు. కవి... స్నేహితుడు సౌదాతో కలిసి 'గోదావరి ప్రవహించు' అని వెలుగెత్తినవాడు. 'రహస్యోద్యమం'తో విప్లవ కవిత్వంలోని భావవ్యక్తీకరణ చట్రాలను పగులగొట్టినవాడు. వొక వినూత్న శైలిలో కవిత్వ రచన సాగించినవాడు. గంగిగోవుపాలలాంటి కవిత్వం మన దోసెట్లో పోసి వెళ్లినవాడు. కవిత్వ ప్రచురణలతో ఆధునిక కవిత్వ పాఠకుల దాహం తీర్చినవాడు.

వొక్క యేడాది (1990)లోనే నెలకో పుస్తకం చొప్పున పన్నెండు ప్రచురణలతో తెలుగు కవితాలోకంలో కనీవినీ యెరుగని సంచలనం సృష్టించినవాడు. అందులో వొక్క పుస్తకం కూడా పంచి పెట్టలేదు. దప్పిక గొన్న పాఠకులూ ఆ సంకలనాలను సంతోషంగా కొనుక్కుని మరో సంకలనం యెప్పుడెప్పుడు వస్తుందాని దాహార్తి హృదయాలతో యెదురు చూసేవారు. ఆ పుస్తకాలు... ఆ కవులు... ఆ పుస్తకాల సైజ్... పేజ్ మేకప్... కంటెంట్... ఆ కవులెవరో, ఆ సంకలనాలేమిటో వొక్కసారి చూద్దాం -

క్రితం తర్వాత - ఆరుగురు యువ కవుల సంయుక్త కవిత... యెక్కడైనా యిక్కడే - ప్రీతీష్ నంది కవిత్వానువాదం త్రిపురనేని శ్రీనివాస్ ... 19 కవితలు - గాలి నాసరరెడ్డి... ఒఖడే - స్మైల్ ...

బతికిన క్షణాలు - వేగుంట మోహన ప్రసాద్... ఇక ఈ క్షణం - నీలిమా గోపీచంద్

ఫోర్త్ పర్సన్ సింగులర్ - గుడిహాళం రఘునాథం... బాధలూ-సందర్భాలూ - త్రిపుర... గురి చూసి పాడే పాట - స్త్రీవాద కవితలు... ఎన్నెలో ఎన్నెల - రావిశాస్త్రి కవిత్వం... పుట్టుమచ్చ - ఖాదర్ మొహియుద్దీన్ ... మరోవైపు - దేశదేశాల కవిత్వానువాదం త్రిపురనేని శ్రీనివాస్...

ఆ తర్వాత మరో రెండు సంకలనాలు స్వప్నలిపి - అజంతా, చిక్కనవుతున్న పాట - దళిత కవిత్వం... యీ కవులని ఆ కవిత్వాన్ని చూస్తే అర్థమైపోతుంది తెలుగు కవితా ప్రపంచానికి శీనూ యిచ్చిన అందమైన క్రియేటివ్ కాంట్రిబ్యూషన్ యేమిటో...

శీనూ ప్రచురించిన పుస్తకాలను చూసినప్పుడు ఆశ్చర్యపోయానని, ఆ పుస్తకాలలోని కంటెంట్ కు... వాటి రూపానికి ముగ్ధులయ్యానని వడ్డెర చండీదాస్ గారి నోట విన్నప్పుడు భలే సంతోషమేసింది.

1996 ఆగస్టు 17 న హైదరాబాద్ లోయర్ టాంక్ బండ్ రోడ్డులో జరిగిన ప్రమాదంలో శీనూ యీ లోకాన్ని ముప్పై మూడేళ్ళ వయస్సులో వదిలి వెళ్ళిపోయాక యీ అద్భుతమైన కవీ... యెడిటర్... యింటర్వ్యూయర్ కవిత్వాన్ని 'హైకూ'గా శీను మిత్రులు 1997లో కవిత్వం ప్రచురణల పదిహేనవ పుస్తకంగా సరికొత్త గెటప్ లో ప్రచురించారు.

'హైకూ' ప్రశంసలు... విమర్శలు కూడా అందుకుంది. అప్పుడు 'హైకూ' మీద వార్త 'మైదానం' కాలమ్ లో "మనకు తెలిసిన ప్రేమలన్నిటికన్నా వున్నతమైన ప్రేమ వొకటున్నది అది సంపూర్ణ స్వేచ్ఛలోనే వికసిస్తుందని తెలుసుకుంటే?

యెదుటివారిని స్వేచ్ఛను గుర్తించడమంటే ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాలలోని అధికారాన్ని... అహంకారాన్నీ వదులుకోవడమేనని తెలిసి కూడా 'నీ రాత్రి నీ కోసం నా రాత్రి నా కోసం' అని చెప్పగలిగితే?

ఆ నూతన మానవునిపై మనకెంత ప్రేమ కలుగుతుంది?

'యీ సృష్టికైన అనాది చలనంలో' యెక్కడో తప్పిపోయిన స్వచ్ఛమైన ఆదిమ హృదయం తిరిగి వెల్లడైనంత ప్రేమ కలుగుతుంది. వేనవేల యేళ్ళ తర్వాత ఒక చెలిమె కనిపించినంత ఆనందం కలుగుతుంది. బహుశా శ్రీనివాసుని కనుగొన్నంత సంభ్రమం కలుగుతుంది. లోకాన్ని నిరాకరించి ముక్కు మూసుకోవడమో... మూలాన్ని పదిలంగా వుంచి మెరుగుల మరమ్మత్తు చేయాలనుకోవడమో అతను చేయలేదు.

యీ లోకాన్ని గాఢంగా కావులించుకొని కల్మషాన్ని కడిగేయాలని చూశాడు. 'యెవరో కట్టి పడేస్తే యెగురుతూ యెందుకుండాలి స్తంభానికి జెండాలా?' అని సకల వ్యవస్థల సారాంశానికి అంతటికీ కలిపి వొకే ప్రశ్న సంధించాడు.

యీ ప్రపంచం యిప్పుడున్న తీరులో వుండకూడదని, దీన్ని మెరుగైన మానవీయ నివాసంగా మార్చాలని తాపత్రయపడేవాళ్ళు అనాది నుంచీ వున్నారు. దుఃఖానికి దోపిడీకి నిర్బంధానికి యిరుకుకీ కారణమైన వ్యవస్థలను గుర్తించి వాటిని ధ్వంసం చేయడానికి ప్రయత్నిస్తూనే వున్నారు.

వొక తలుపు తీస్తే చాలు వెలుతురు వస్తుందని, అన్ని బూజులు వదులుతాయని భ్రమ పడుతున్నప్పుడు గోడలు, పైకప్పులు యెందుకని ప్రశ్నించి త్రిపురనేని శ్రీనివాస్ మనల్ని ఆశ్చర్యపరుస్తాడు.

బయట ప్రపంచపు ద్వారాలు సరే, 'మన లోపల యెవరో వేసిన తలుపుల్ని వొక్కసారి తెరిస్తే చాలా చెత్త పోతుందని' నచ్చచెపుతాడు.

'రూళ్ళ ప్రకారమో మార్జిన్ లోనో వుండటం కాదు - స్వేచ్ఛగా సృజనాత్మకంగా గందరగోళంగా వుండటం నేర్చుకోండి. అందమైన లోకం అప్పుడే అందుతుందని ప్రకటిస్తాడు.

'హెూ' రెత్తుతోన్న అతని కవిత్వంని చదువుదాం.

ఆంధ్రజ్యోతి ఆదివారం మేగజైన్ కి త్రిపురనేని శ్రీనివాస్ యెడిటర్ గా వున్నప్పుడు 'మసిగుడ్డ' కథని ప్రచురించాడు. యిప్పటికీ అప్పటి పాఠకులు - యిప్పటి పాఠకులూ ఆ కథని యెంతో యిష్టంగా చెపుతున్న ప్రతీసారీ 'శీనూ కి యిష్టమైన కథా' అనుకుంటాను. నా 'నిర్ణయం' కథ ని యెవరు మెచ్చుకున్నా 'శీనూ డిఫర్ అయిన కథ కదా' అనుకుంటాను.

నేను విజయవాడ నుంచి హైదరాబాద్ వస్తున్నప్పుడు హైదరాబాద్ పట్టుకుని వెళ్ళమని స్టేషన్ కి మంచి యెండలో 'చిక్కనవుతున్నపాట' కవితా సంకలనం ని పుస్తకాల కట్టలు పట్టుకొచ్చి యిచ్చాడు. అప్పుడు చూడాలి శీనూ ముఖం వో కొత్త పుస్తకం తీసుకొచ్చిన వుత్సాహపు మెరుపు. ప్రతీ పనిని స్వయంగా యెంతో యిష్టంగా శ్రద్ధగా చేసేవాడు. వంట చేసినా... వో పుస్తకం అచ్చు వేసినా.. వో కవిత విన్నా... రాసినా ఆ మొత్తం ప్రొసెస్ ని ప్రతి క్షణాన్ని యెంజాయ్ చేసేవాడు.

బిమల్ రాయ్ గారి సినిమాలని హరిహర కళాభవన్‌లో వరుసగా వేసినప్పుడు 'సుజాత' సినిమా చూసి కళ్ళ నిండుగా నీళ్ళు నింపుకున్న సున్నిత హృదయం శీనూది.

'వోటమిలోని సుఖం నన్ను / ప్రలోభ పెట్టినప్పుడల్లా / అతను నన్నుహెచ్చరిస్తూనే వుంటాడు' - అని నా రెండవ కథల సంపుటి 'ముక్త' ని త్రిపురనేని శ్రీనివాస్ స్మృతికి అంకితమిచ్చాను.

యీ అద్భుతమైన కవి తెలుగు సాహిత్య సమాజానికి బోలెడంత ప్రేమతో అందించిన అపురూప కానుకలెన్నో.

'రహస్యోద్యమం', 'హెూ' స్వీయ కవితా సంపుటులతో పాటు అనువాద కవిత్వంలో ప్రీతిష్ నంది 'యెక్కడైనా యిక్కడే, 'మరోవైపు' దేశ దేశాల కవిత్వంతో నిండు కూజాలా తొణికిసలాడిన వాడు.

యెప్పుడూ వొక్కలానే సంతకం చేయలేనని రొమ్ము చరిచి ప్రకటించినవాడు.

దళిత స్త్రీవాద మైనారిటీ వుద్యమాలను అక్కున చేర్చుకున్నవాడు. ఆయా అస్తిత్వవాద వుద్యమబింబాలకు నిలువెత్తు అద్దంలా నిలిచినవాడు.

'గురి చూసి పాడే పాట', 'పుట్టుమచ్చ', 'చిక్కనవుతున్న పాట' సంకలనాలతో వొక నూతన వొరవడికి మార్గదర్శకుడైనవాడు.

యెక్కడెక్కడి అనామక గుండె గొంతుల్లోని పాటలను యేరుకొచ్చినవాడు.
వాటిని వొక మంకెనపువ్వులగుచ్ఛంలో మనకి బహూకరించినవాడు.

ఆద్యంతం ప్రగతిశీలి. నిలువెల్లా ప్రయోగవాది.
సౌదా అన్నట్టు వొక్క జన్మ. ఆ జన్మలో వొక వంతే జీవించి...
ప్రేమించి... రచించి... వుద్యమించి ఆ
అందమైన నవ్వు ముఖంతోనే అందరినీ వదిలి అర్ధంతరంగా వెళ్లిపోయాడు.

వో నా యావన్మంది గురి చూసి పాడే పాటల్లారా...
వో నా యావన్మంది చిక్కనవుతున్న పాటల్లారా...
వో నా యావన్మంది పుట్టుమచ్చల్లారా ...
యిక్కడి దాకా మనం నడిచి వచ్చాం... యిది త్రిపురనేని శ్రీనివాస్ వేసిన దారి.
అతడు స్త్రీ కాదు.
అతడు దళితుడు కాదు.
అతను ముస్లిం కాదు ... కానీ అందరి రాతలు గుత్తకి తీసుకొని వొక్కడే దారి వేశాడు.
స్త్రీ వాదం... దళిత వాదం... మైనారిటీ వాదం... త్రివాద పతాకంగా అస్తిత్వవాద వుద్యమాలను యెగరేసినవాడు.
త్రిశ్రీ... ఆ జెండా యే గుంజకి కట్టింది కాదు.
హద్దులు లేకుండా ఆకాశంలో స్వేచ్ఛగా యెగిరే జెండా అది. అదే శీనూ ఆకాశం.
మనందరి ఆకాశం.

ఎంకి పాటల నండూరి చెప్పినట్టు అతని వొక్క నవ్వు చాలు వజ్ర వైఢూర్యాలు.
ఆ సాహసకి మందారపూల వందనాలు.
ఆ సాహసి నుదుటున రోజా పువ్వుల ముద్దులు. ❊

కవిసంధ్య

కవి సంధ్యకు చందాలు, రచనలు, సమీక్ష కోసం పుస్తకాలు (రెండు ప్రతులు) పంపేవారు ఈకింది హైదరాబాద్ కార్యాలయం చిరునామాకు పంప వలసిందిగా కోరుతున్నాం. సంపాదకుడు, కవిసంధ్య, ప్లాట్ నం.61/10, సిద్దార్థ నగర్, వెంగళరావు నగర్, హైదరాబాద్-500038, ఫోన్:7989973805.
Kavisandhya.yanam@gmail.com

మన కావ్య సంకలనాలు

# స్త్రీవాద కవిత్వ కాలనాళిక – "గురి చూసి పాడే పాట"

– సుధామ, 98492 97958



త్రి. శ్రీగా తెలుగు సాహిత్యంలో గుర్తింపబడిన సంచలన కవి త్రిపురనేని శ్రీనివాస్. ఆధునిక తెలుగు కవిత్వంలోని భిన్నధోరణులకు ఒక చారిత్రక నమోదు కలిగించిన వాడు తనే! 1990 ఏప్రిల్‌లో 'కవిత్వం ప్రచురణలు' నెలకొల్పి వైవిధ్యభరితమైన గ్రంథాలను ఒక అపూర్వసంచలనంగా అందిస్తూ వచ్చాడు. ఆరంభించిన ఏడాది కాలంలోనే పన్నెండు పుస్తకాలు ప్రచురించాడు.

గ్రంథముద్రణలో, పుస్తక పరిమాణంలో కూడా మొనాటమీని తెగనరికి వినూత్న కవిత్వం, వైవిధ్యమైన ఆసక్తిదాయక లేఅవుట్‌లతో వెలువరించాడు. త్రి.శ్రీ.యే పూనుకోకపోతే అజంతా 'స్వప్నలిపి' మిగిలేదే కాదేమో!

1986 నుండి కవిత్వంలో ముఖ్యంగా తెలుగు కవిత్వంలో స్త్రీలు తమదైన గళాన్ని విప్పార్చడం మొదలయింది. వారి రనలు ఆడవాళ్ళ ఆలోచనల్లోని మార్పుని చూపెట్టాయి. ఆడవాళ్ళు తమ సమస్యలపట్ల తటస్థంగానూ, నిశ్శబ్దంగానూ ఉండేటటువంటి పరిస్థితి మారుతూ వచ్చింది" జయప్రభ అన్నట్లు – "అప్పటికి గాని పాత విలువలు బీటలువారుతున్న వైనాన్ని కుటుంబం నాలుగ్గోడల మధ్య తొక్కిపట్టిన గొంతులు ఆ గోడల్ని దాటి ఖంగుమనటంలోని ప్రమాదాన్ని, పితృస్వామ్యాన్ని, అది రూపొందించిన కుటుంబాన్ని ఆడవాళ్ళ భుజాలమీదకెక్కించి నిరంతరం కాపలా కాసే అన్ని వర్గాల పురుషులూ గుర్తించలేకపోయారు". గుర్తించిందే తడవుగా – జ్వాలాముఖి, రావిశాస్త్రి, రంగనాయకమ్మ, అద్దేపల్లి, యస్వీ సత్యనారాయణ వంటివారు తమదైన ధోరణిలో వ్యతిరేక వాఖ్యలు చేశారు.

విరసం వారసత్వంగా స్త్రీ వాద కవిత్వం ఉద్భవించలేదనీ, "నిజానికి స్త్రీవాద కవిత్వం వల్లనే, స్త్రీల ఆలోచనా సరళిలో వచ్చిన మార్పులకి అనుగుణంగా విప్లవ సంస్థలే తమనితాము సరిదిద్దుకోక తప్పని స్థితిలో పడ్డాయి" అనీ అంటారు జయప్రభ.

ఏమయినా స్త్రీవాద స్వరంతో కవయిత్రులు రాసిన కవితలతో తెలుగులో వచ్చిన మొదటి సంకలనం త్రిపురనేని శ్రీనివాస్ వెలువరించిన 'గురిచూసి పాడేపాట' అనక తప్పదు. కవిత్వం ప్రచురణలు-9 వరిగా డిసెంబర్ 1990లో రూ. 10 వేలతో వెలువడిన 63 పేజీల ఈ స్త్రీవాద కవిత్వ సంకలనంలో విమల, ఓల్గా, వసంత కన్నభిరామ్, కొండేపూడి నిర్మల, పాటిబండ్ల రజని, ఘంటశాల నిర్మల, జయప్రభ, సావిత్రి, ఏలూరి పార్వతి, బి.పద్మావతి, రావులపల్లి సునీత, మందారపు హైమవతి, రేవతీ దేవి, వాశీరుగా రావు, శివలెంక రాజేశ్వరీదేవి, శిలాలోలితల కవితలున్నాయి. విషయ సూచిక అంటూ ఏమీ లేదు.




ఇందులో ఏ రకమైన అకడమిక్ డిసిప్లిన్ పాటించలేదు అనీ అక్షర క్రమాన్నిగానీ, కాలక్రమాన్ని గానీ పాటించలేదనీ, వస్తువుని బట్టి వర్గీకరించే ప్రయత్నం మాత్రం కొంత చేశామనీ, ఇందులో వున్నవే మంచి కవితలని, స్త్రీవాద దృక్పథంతో రాసినవి ఇవి మాత్రమేననీ అభిప్రాయం మాకు లేదనీ, "మా దృష్టికి రాని మంచి కవితలు ఇంకా ఉండచ్చు. పెద్ద పరిశోధనచేసి అన్ని కవితలనూ ఇందులో చేర్చాలనే ప్రయత్నం మేం చేయలేదు. కాబట్టి మా దృష్టికి వచ్చినవి, వాటిలో మేం మంచివి అనుకున్నవి మాత్రమే ఇందులో చేర్చాం" అనీ ప్రచురణకర్తల మాటగా త్రిశీ పేర్కొన్నాడు.

కొండేపూడి నిర్మల 'హృదయానికి బహువచనం'తో మొదలయ్యే 'సరిచూసి పాడేపాట' సంకలనం ఓల్గా 'ప్రతి స్త్రీ ఒక నిర్మల కావాలి!' అనే కవిత తర్వాత 'సంఘంలో చేరుదాం' అనే ఒక జానపద కవితతో ముగుస్తుంది. (ఓల్గా పేర్కొన్న నిర్మల పంచాది నిర్మల సుమా!)

స్త్రీ వాద కవిత్వంలో ఉదాహృత మైలురాళ్ళుగా మిగిలిపోయే కొండేపూడి నిర్మల - 'హృదయానికి బహువచనం', 'లేబర్ రూమ్', జయప్రభ - 'చూపులు', 'పైటని తగలెయ్యాలి', ఘంటశాల నిర్మల - 'జుగల్ బందీ', 'ఎ' కాల్‌గల్స్ మొనొలాగ్', విమల - 'వంటిల్లు', 'సౌందర్యాత్మక హింస', మందరపు హైమవతి - 'సర్పపరిష్వంగం', సావిత్రి - 'బందిపోట్లు', పాటిబండ్ల రజని - 'అబార్షన్ స్టేట్‌మెంట్ వంటి కవితలను సంతరించుకున్న సంకలనం ఇది. స్త్రీవాద కవిత్వాన్ని ఇలా తొలిసారిగా సంకలనం చేసిన చారిత్రక సందర్భానికి త్రిపురనేని శ్రీనివాస్‌యే మూలకర్త.

1989 తర్వాత ఊపందుకుని తెలుగు సాహిత్య రంగాన్ని ఒక కుదుపు కుదిపిన స్త్రీవాద కవిత్వంను 'గురిచూసి పాడేపాట'గా సంకలించి త్రిపురనేని శ్రీనివాస్ అది ఒక ఉద్యమ స్థాయి గుర్తింపు పొందడానికి దోహదపడ్డాడనక తప్పదు. స్త్రీ రచయిత్రులు తాము ఫెమినిస్టులమని చెప్పుకోవడానికీ, మగవాళ్ళు కూడా తాము ఆ కోవవారమేనని ప్రకటించుకోవడానికీ స్త్రీవాద కవిత్వం బాటలు వేసింది. కథల్లో, విమర్శల్లో, నవలల్లో ఈ దృక్పథం గల రచనలు రావడం జరిగింది.

'నీలిమేఘాలు' సంకలనం కన్న 'గురిచూసి పాడే పాట'యే ఉత్తమ సంకలనం అనడానికి జయప్రభ చెప్పిన ఈ మాటలే దాఖలా – 'నీలిమేఘాలు' స్త్రీల కవితా సంకలనంలో అంతకు ముందు త్రిపురనేని శ్రీనివాస్ ప్రచురించిన 'గురిచూసి పాడేపాట' సంకలనం నుంచి పునర్ముద్రించినవి మినహాయిస్తే విడిగా నీలిమేఘాల సంకలనం కోసం ఎంపిక చేసిన చాలా కవితల్లో "కవిత్వపు పాలు" తక్కువగా కన్పిస్తుంది! కొంతమందిని అదే తొలిరచనా తుదిరచనా కూడా అనుకుంటాను! అందులో కొందరు కవయిత్రులు చెప్పుకోదగ్గ మరో కవిత రాసిన వాళ్ళు లేరు! ఆ పుస్తకం తెలుగు సాహిత్యంతో సమాంతరంగా స్త్రీల కవిత్వం ఒక ఉద్యమంలాగా సాగిన భ్రమని కల్గిస్తుంది! అది భ్రమ మాత్రమే! నిజం కాదు."

నాడు పేరొందిన స్త్రీవాద కవయిత్రియే మెచ్చిన పురుషుడు చేసిన సంకలనం త్రిపురనేని శ్రీనివాస్ "గురిచూసి పాడేపాట". ❊

## ఆహ్వానం లక్ష్మి మృతికి 'కవిసంధ్య' నివాళి



ప్రముఖ పాత్రికేయులు, ఆహ్వానం, మాసపత్రిక వ్యవస్థాపక సంపాదకులు శ్రీమతి ఎస్.ఎస్. (సమయం సామ్రాజ్య) లక్ష్మి అనారోగ్యంతో ఫిబ్రవరి 18న విజయవాడ లో ఓ ప్రైవేటు ఆసుపత్రిలో కన్నుమూసారు. 1993లో విజయవాడ కేంద్రంగా ఆమె స్థాపించిన 'ఆహ్వానం' మాసపత్రిక మిగతా పత్రికల కంటే భిన్నంగా వుండేది. స్వతహాగా స్త్రీవాది అయిన లక్ష్మి గారు స్త్రీల రచనలకు ఆహ్వానం పత్రికలో ప్రముఖంగా స్థానం కల్పించేవారు. వర్తమాన అస్తిత్వ ఉద్యమాలైన స్త్రీవాద, దళితవాద సాహిత్యాలపై చర్చలు నిర్వహించేవారు. ఆర్థికపరమైన ఒడిదుడుకులతో ప్రారంభించిన కొన్ని సంవత్సరాలకే పత్రిక మూతపడింది. 'ఆహ్వానం' పత్రికను విలక్షణంగా నడిపిన సంపాదకులు శ్రీమతి ఎస్.ఎస్. లక్ష్మి మృతికి 'కవిసంధ్య' నివాళులు అర్పిస్తోంది. ❊

# త్రి.శ్రీకి శేషేంద్ర లేఖ

శేషేంద్ర
GYAN BAGH PALACE, GOSHA MAHAL,
HYDERABAD-500012, (INDIA).



మిత్రమా! మీ పుస్తకమంతా చదివాను. గత రెండు దశాబ్దాల్లో మొదటిసారి మీ "రహస్యోద్యమం" పేజీల్లో ఆశ్చర్యకరమైన కవిత్వాన్ని ఎదుర్కొన్నాను. పంక్తులు పంక్తులే సాయుధ సైన్యాల్లా కార్యోన్ముఖంగా పరుగెత్తుతున్నాయి. "Any publication is an act and that art exposes one to the passions of an age that forgives nothing" అని ఆల్బర్ట్ కామూ అన్న వాక్యాలు గుర్తుకొచ్చాయి. (from the pages of "Resistance, Rebellion and Death")

ఒక్కొక్క మాటను వాసన చూస్తూ, చప్పరిస్తూ, స్పృశిస్తూ మొత్తం మీ కవిత్వాన్ని పొదివి కౌగలించుకున్నట్లయింది. చాలా మాటల్లో గంధకం వాసన కొడుతూ ఉంది. అనేక ధ్వనులు అనేక చిత్రాలు నా గుండెకు అతి సన్నిహితమైనవి, నా క్రోధ స్వభావానికి మేతవేశేవి ఎన్నో నన్ను ముసురుకున్నాయి. "నినాదాలు రాసిన గోడలు / ... రోడ్డు మీద ఒంటరిగా వెడుతున్న వీరుడ్ని పిలిచి / తన మీద గీసిన తుపాకిని చేతిలో పెట్టి సాగనంపే ఆయుధాగారాలు", "చేతులకు వేళ్ళు మొలిచుకొచ్చిన సన్నివేశంలో / పిడికిలి స్వరూపం అర్థమై పులకించి పోయాను / నాలోనే ఆయుధం ఉన్నందుకు!" "భయం ముందు నిర్భయంగ చెలరేగి పోతాను". "ఈ ప్రపంచంతో సుదీర్ఘ శత్రుత్వం నాది" ఈ పంక్తులు ఎంతో ప్రియమైనవి. వర్తమానకాలం కడుపులోనుంచి ఇలాంటి నిర్భయ కవిత్వమే పుడుతుంది. "To create today is to create dangerously" అన్నాడు కామూ (అదే పుస్తకంలో)

"లోపల సరస్సులున్న మనిషి బయట సముద్రాల్ని సృష్టిస్తాడు... అతడు ఎవరి వెనకా నడవడు / అతడు సృజనకు జన్మభూమి" అన్న మీ గొంతు ఈ నాటి రాజకీయ సాహిత్య పోలీసుల గుండెల్లో భయంకర మేఘగర్జఌ ధ్వనిస్తుంది. ఈ డ్రిల్లు డ్రెస్సు తుపాకీ లేని ఈ పోలీసులు "సృజనకు జన్మభూమి" అయిన స్వేచ్ఛాప్రియకవిని వ్యక్తిగతంగా దండిస్తారు, వాళ్ళ రాజకీయ బలగంతో. సాహిత్య విమర్శలో తిరుగులేని జడ్జి లాంటివాడయిన ఇలియట్ ఏమంటాడో చూచారా, "Honest criticism and sensitive appreciation is directed not upon the poet but upon the poetry" (Tradition and individual Talent)

మీకు నా హార్దిక అభినందనలు...

మీ శేషేంద్ర

13-09-1989

# అతడు సృజనకు జన్మభూమి

**- నామాడి శ్రీధర్**, 9396807070



కవిత్వమొక తీరని దాహమన్న కవివాక్కుకి శ్రీనివాస్ నిలువెత్తు నిదర్శనంగా జీవించారు. ఉద్యమం నుంచి బయటికి వచ్చిన తర్వాత కవిత్వరచనకి, పాత్రికేయ వృత్తికి మాత్రమే పరిమితం కాలేదు. పలువురు కొత్త కవులను ప్రోత్సహించ సాగారు. ఎక్కడ నవీనత వికసించనీ, ప్రయోగాత్మకత కనిపించనీ ఆయన పసిగట్టేవారు. ఆ రచనలను అచ్చువేయడమే గాక ఉత్తరాలతో ఉత్సాహపరిచేవారు.

1990లలో రాజమండ్రి నుంచి ఒమ్మి రమేష్ బాబు, తల్లావజుల శశిశేఖర్, నేను కలసి 'కంజర కవిత్వ బులెటిన్ తీసుకొచ్చే వాళ్లం. తొలి సంచికని చూసీ చూడగానే ఆయన పరవశించిపోయారు. అప్పటి 'ఉదయం' లిటరరీ పేజీలో శ్రీనివాస్ రాసిన కవితాత్మక పరిచయం మమ్మల్ని ఉక్కిరిబిక్కిరి చేసింది. ఆదరంతో 'కంజిర'ని ఉద్దేశించి ఓ ప్రేమలేఖ కూడ రాశారు. ఆ తర్వాత ఆయన ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం ఇన్‌ఛార్జి. ఓసారి మిత్రులం ఊరికే విజయవాడ ఆఫీసుకు వెళ్లాం. మీరు రాసిన కవితలన్నీ మీకు కంఠస్థమట కదా, ఒక కవిత రాసివ్వండి. అచ్చువేస్తాను' అన్నారు. ఇచ్చేంతవరకు ససేమిరా ఊరుకోలేదు.

అస్తిత్వవాద ఉద్యమాల పొద్దుపొడుపు కాలంలో ఆయన ఒక పాత్రికేయుడిగా ఎనలేని మేలు చేశారు. స్త్రీ, దళిత, మైనారిటీ వాదాల సాహిత్య ప్రక్రియలకి పత్రికలో అత్యధిక ప్రాధాన్యం కల్పించారు. అందుకోసం ఉద్యోగపరమైన ఎన్ని వత్తిళ్లని ఎదుర్కొన్నారో తెలియదు గాని, కాలం గుండెచప్పుడిని గుప్పెట పట్టి ప్రపంచానికి వినిపించారు. శ్రీనివాస్ కేవలం కవి మాత్రమే కాదు క్రాంతదర్శి, తిరుగుబాటుదారు కనుకనే అది సాధ్యమయింది.

ఇదంతా ఒక సంబరమైతే, ఆయన కవిత్వం ప్రచురణలు' అపూర్వ సంచలనం. 1990 నుంచి 35 వరకు ఆయిదేళ్లు. పద్నాలుగు పుస్తకాలు. 1. క్రితం తర్వాత... ఆరుగురు యువ కవుల సంయుక్త కవిత 2. యెక్కడైనా యిక్కడే... ప్రీతిష్ నంది కవిత్వానువాదం... త్రిపురనేని శ్రీనివాస్ 3. 19 కవితలు.. గాలి నాసరరెడ్డి 4. ఒఖడే... స్మైల్ 5. బతికిన క్షణాలు... వేగుంట మోహనప్రసాద్ 6. ఇక ఈ క్షణం... నీలిమా గోపీచంద్ 7. ఫోర్త్ పర్సన్ సింగులర్... గుడిహాళం రఘునాథం 8. బాధలూ-సందర్భాలూ... త్రిపుర 9. గురిచూసి పాడే పాట... స్త్రీవాద కవితలు 10. ఎన్నెలో

ఎన్నెలో... రావిశాస్త్రి కవిత్వం 11. పుట్టుమచ్చ.. ఖాదర్ మొహియుద్దీన్ 12. మరోవైపు.. దేశ దేశాల కవిత్వానువాదం, త్రిపురనేని శ్రీనివాస్ 13. స్వప్నలిపి... అజంతా 14. చిక్కనవుతున్న పాట... దళిత కవిత్వం.

ఈ కవులు మహా ఘటికులు. ఎవ్వరి మాటని ఖాతరు చేయరు. అంతకు మించిన ఘనాఘనుడు శ్రీనివాస్. ఆయన పూనుకోవడం వల్లనే ప్రతి ఒక్కటీ పుస్తక రూపం దాల్చిందంటే గొప్ప చేసి చెప్పడం ఎంత మాత్రం కాదు.

అది కొంత్త కవిత్వంతో ఉప్పొంగిన కాలం. అందంగా, ఆశ్చర్యకరంగా, నిరలంకారంగా ప్రతి పుస్తకం దేనికదే ప్రథమం. ప్రత్యేకం. రూపురేఖల్లో ఆధునికం. సంతకం ఎప్పుడూ ఒకేలా చేయలేనని ప్రకటించిన కవి ప్రచురించిన పుస్తకాలు మూసపోసినట్టు ఎందుకుంటాయి మరి? వడ్డెర చండీదాస్ కవిత్వం ప్రచురణల గురించి అడ్లూరు రఘురామరాజుకి రాసిన ఉత్తరంలో ఏమన్నారంటే... 'గురిచూసి పాడే పాట' స్త్రీవాద కవితలు- అంటూవో పుస్తకం వొచ్చింది. వాళ్లే త్రిపురనేని శ్రీనివాస్ గారికి రాస్తున్నాను. వాళ్ల ప్రచురణలు యిక నుంచీ వో ప్రతి మీకు పంపిస్తూండమనీ, ప్రతిదానికి చిల్లర మల్లరగా కాక వొకసారిగా డిడి పంపిస్తూంటారనీ, నేను పుస్తకాలు వెలకి రెట్టింపు చెల్లించదలిచాను. యత్నం నచ్చి ప్రోత్సాహంగా తోడ్పాటుగా వుంటుందని'.

1998 ఆగస్టు 17. హైదరాబాద్ లోయర్ టాంక్ బండ్ రోడ్డు ప్రమాదంలో శ్రీనివాస్ చనిపోయారు. అప్పటికి ఆయన వయస్సు 33 సంవత్సరాలు. ఆ రోజున ఆకాశం శోకావృతమయింది. ప్రతి మైత్రీహృదయం ఆవేదనతో రోదిం చింది. ఆఖరికి ఎడతెరపి లేని వానలో ప్రియమైన కవి అంతిమయాత్ర సాగింది.

శ్రీనివాస్ ఆకాల మరణానంతరం ఆయన కవిత్వం 'హైకూ' పేరుతో వెలువడింది. ఆయన ప్రాణ మిత్రులు 1997లో కవిత్వం ప్రచురణలు 15వ పుస్తకంగా అత్యాధునిక రీతిలో ప్రచురించారు. గాలి నాసరరెడ్డి అనువదించిన బహుభాషల కవిత్వ పుస్తకం 'సాంగత్యం': కుప్పిలి పద్మ కథల సంపుటం 'ముక్త' శ్రీనివాస్ స్మృతికి అంకితమిచ్చారు.

త్రిపురనేని శ్రీనివాస్ కవితలు, ప్రచురణలు తెలుగు సమాజానికి అవ్యాజమైన ప్రేమతో ఆయన బహూకరించిన కాన్కలు. అవి అమూల్యం, నిత్య నూతనం. ❊

## గమనిక

**కవిసంధ్య-42, మే-జూన్, 2023 సంచిక త్రిపురనేని శ్రీనివాస్ ప్రత్యేక సంచికగా వెలువడుతున్నందున 'కొత్త పుస్తకం', 'కవితలు, మంచి పద్యం శీర్షిక'లను ఈ సంచికలో అందించలేకపోతున్నాం! వచ్చే సంచిక నుండి యధాతథంగా అందిస్తాం - సంపాదక వర్గం**

# గానా కు త్రిశ్రీ లేఖ

విజయవాడ
14-5-1990

డియర్ నాసరరెడ్డి



నీ కవిత్వాన్ని అచ్చువేద్దామని నాకు ఎంతగానో అనిపించింది. ఇప్పటికీ అనిపిస్తోంది. నీ కవిత్వం అంటే నాకిష్టం. ప్రేమ.

అచ్చువేద్దామని అనుకోగానే నీ ఆచూకీ కోసం ప్రయత్నించాను. దొరకలేదు. చివరకు ఐడియా వచ్చి శివారెడ్డి గారికి ఉత్తరం రాశాను. నీ అనుమతి తీసుకోనిదే ప్రచురించకూడదని అనిపించింది. సంకలనం గురించి నీకు కొన్ని ఆలోచనలు ఉండొచ్చు. వాటిని నేను భగ్నం చేయొచ్చు అని సందేహించాను. అయితే నీ చిరునామా దొరకని ఒక దశలో నిన్ను సంప్రదించకుండానే వేసేద్దామని కూడా బలంగా అనుకున్నాను. చివరకు నువ్వే ఉత్తరం రాశావు.

సంకలనం ఇప్పుడే వద్దని నువ్వు రాసింది చదివి నాకు నిరాశ కలిగింది. అయితే నా నిరాశ కన్నా నీ నిరాశ ముఖ్యం కాబట్టి నీకు సమ్మతం కానిదే ఏదీ చేయకూడదనుకున్నాను. 'క్రితం తర్వాత' బుక్‌లెట్ చూశావా! ఆ పద్ధతిలో ప్రతినెలా 'కవిత్వం ప్రచురణలు' పేరిట ఒక బుక్‌లెట్ వేద్దామని నా ప్రయత్నం నిధులు సొంత బాధ్యత మీద నేను సేకరించి వేస్తాను. కవిత్వం ప్రచురణలు కింద Old Masters, new voices, translations, collective poems ఇలా నెలకో పద్ధతిలో వేద్దామని కోరిక.

కవిత్వం మీద ప్రేమతో, కవిత్వం కోసం ఏదైనా చేయాలన్న తపనతో ఈ పని మొదలెట్టాను. అందులో భాగంగా నీ కవితలను 15 గానీ 20 గానీ ఎంపిక చేసి 'క్రితం తర్వాత' సైజులో, పద్ధతిలో వేద్దామని అనుకున్నాను. ఈనెల నీది ప్రచురిద్దాం అంటే నువ్వు కాదన్నావు. స్మైల్ గారిది వేద్దాం అంటే ఆయన కవితలు ఆయనకే దొరకటం లేదు. ఘంటశాల నిర్మల కవిత్వం అనుకుంటే ఆమె రాసిన కవితల్లో నాలుగే ఆమెకు నచ్చాయట. మరో రెండు యాడ్ చేసి ఇస్తానంది. అందుకని ఈ నెల ప్రీతీష్ నంది షార్ట్ పోయమ్స్‌ను అనువాదం చేసి వేస్తున్నాను. నా ప్రచురణావేశానికి అదీ కారణం.

ఇంతకూ నువ్వేం చేస్తున్నావు? మరెక్కడైనా ఉద్యోగం కోసం ప్రయత్నిస్తున్నావా? లేక అకడమిక్‌గా ఏదైనా ప్రిపేర్ అవుతున్నావా?

19 కవితేలు

గాలి నాసరరెడ్డి

మరీ అంత ముఖ్యమైన పనులు లేకపోతే ఒకసారి విజయవాడకు రా! నా దగ్గర రెండు రోజులుండి పోదువు గాని. మనం చక్కగా బోల్డు కబుర్లు చెప్పుకోవచ్చు. ఇక్కడ అందర్నీ కలిసినట్టూ ఉంటుంది.

అన్నట్టు స్మైల్ గారికి హైదరాబాద్ బదిలీ అయింది. కావాలనే కోరి చేయించుకున్నారు. నిన్ననే ఆయన ఇక్కడ్నుంచి వెళ్లిపోయారు. స్మైల్ గారు లేని విజయవాడ మాకు కొంచెం వెలితిగానే ఉంటుంది. ఆయన మంచి స్నేహితులు. అదీగాక మాకు బాగా అలవాటైంది. ఆయన వెళ్లిపోతుంటే మాకు ఏదోగా అనిపించింది.

ఈ ఉత్తరంతో పాటే 'క్రితం తర్వాత' బుక్‌లెట్ పంపుతున్నాను. చదివి అభిప్రాయం చెప్పు. 'రహస్యోద్యమం' ద్వితీయ ముద్రణ వేశాను, చూశావా? ఏమిటో నాకే ఆశ్చర్యంగా ఉంది అయిదున్నర నెలల్లో కవిత్వం తొమ్మిది వందల కాపీలు అమ్ముడుపోవటమేమిటా అని! మిగిలిన వంద కాపీలు రివ్యూలకూ, ఫ్రీగానూ ఇచ్చేశాను.

ఏ మాత్రం వీలున్నా నువ్వు విజయవాడకు రా. అజంతా, మోహన్ ప్రసాద్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, అఫ్సర్, ప్రసేన్, ఘంటశాల నిర్మల తదితరులనందరినీ కలవొచ్చు. ఇక మన జంట వుండనే ఉంది కదా. శుభ్రంగా ఎంజాయ్ చేద్దాం బీభత్సంగా.

ఉంటాను.

నీ ఉత్తరం కోసం ఎదురుచూడటం లేదు. నీ కోసమే ఎదురు చూస్తుంటాను.

విజయవాడ నీకు బాగానే తెలుసా? తెలీక పోయినా ఫరవాలేదు. బస్టాండ్‌లో దిగి బందరు రోడ్డు వెళ్లే బస్సులెక్కి ఉదయం ఆఫీస్ దగ్గర దిగు. ఆఫీస్‌లో అడుగు, నేను డ్యూటీలో లేకపోయినా ఇల్లు చూపిస్తారు. పక్కనే సందులో అతి దగ్గర.

– త్రిపురనేని శ్రీనివాస్

## ప్రత్యేక కృతజ్ఞతలు

'కవిసంధ్య'-**42**, మే-జూన్, **2023** సంచిక త్రిపురనేని శ్రీనివాస్ ప్రత్యేక సంచికగా వెలువడుతోంది. ఈ సంచికకు వ్యాసాలు, ఫోటోలు, ఉత్తరాలు ఇతర సమాచారం అందించిన మిత్రులు గాలి నాసరరెడ్డి, వేమన వసంతలక్ష్మి, డా॥ కుంచే నాగసత్యనారాయణ, గుంటూరు, అన్నమయ్య గ్రంథాలయం బాధ్యులు డా॥ లంకా సూర్యనారాయణ, శ్రీమతి సుభాషిణి గార్లకు 'కవిసంధ్య' ప్రత్యేక కృతజ్ఞతలు తెలియచేసుకుంటోంది. ❊

# బొమ్మల్లోని మర్మమెల్ల సాధించిన 'బాలి'

- శివాజీ, 9959178532



బాలి గారు వెళ్లిపోవడంతో తెలుగు కార్టూనిస్ట్, ఇల్లస్ట్రేషన్స్ వరకు కచ్చితంగా ఒకతరం వెళ్ళిపోయింది. తెలుగు సాహిత్యంలో ఆధునిక కథ, నవల ఆలస్యంగా వచ్చినట్టే అలాంటి కథలకు నవలలకు బొమ్మలు చేర్చడం అనేది ఇంకా ఆలస్యంగా జరిగింది, లేదా అలా బొమ్మలు నల్ల సిరాతో గీతలతో, నల్ల నీడలతో కొత్త రకం బొమ్మలు వేసే చిత్రకారులు మరీ ఆలస్యంగా అవతరించారు.

వపా, బాపు, చంద్రమోహన్ వరసన బాలి వచ్చి చేరి తెలుగు కథలకు, నవలలకూ మంచి కళ చేర్చారు. వప, బాపుల గురించి చెప్ప వలసింది లేదు, మహనీయులు, చదివే దృశ్యం, పాత్రకు సినిమా చూపెట్టినట్టు బొమ్మలు వేయడానికి ఆ పెద్దలకు కాస్తంత అవతల బాలి ఎనిమిది కష్టాలూ కింద మీదా పడనే పడ్డారు. కూర్పు, భిన్నత్వం, దృష్టి కోణం ఇవన్నీ ఆషా మరియు మాషీగా ఆర్టిస్టుల పంచన చేరవు. పాఠకులు, ప్రేక్షకులు అనే ఆసాములు చూసే విషయంలో సుశిక్షితులు కావలసిందే, అలాగే చిత్రాలునున్ను. అందుకే బాలి పడిన శ్రమ, శ్రద్ధా శక్తులు బాగా ఫలించి ఎంచక్కటి బొమ్మలు సరఫరా అయ్యేయి. కవులు చిత్తమొచ్చినది రాసేస్తే చాలదు, వాటిని ప్రేమించి అచ్చు వేయగల సంపాదకులు మంచి బొమ్మలకో సమూ తాపత్రయ పడాలి, నిశ్శబ్దంగా బొమ్మలు సాధించేనాటికి ఆంధ్ర జ్యోతి, తదితర పత్రికలన్నీ బాలికి మంచి అవకాశం ఇవ్వడంతో పాఠకులకు పసందైన బొమ్మలు చూసే అల వాటయింది. బాలి మెరుగయిన గీతల వెనుక స్వర స్థానం అట సులువుగా కనబడని వయొలిన్‌ను సాధన చేసినట్టే బాలి గీతల సాధన చేసి భలే అనిపించుకున్నారు. అలాగని సాధనతో ప్రతిదీ సులభముగా సాధ్య పడదు అని ముందే గతించిన బాలి గీతాలకు హాస్య రేఖలు కూడా అంది వచ్చాయి. అందుకే బాలి కార్టూన్ బొమ్మల్లోని మర్మమెల్ల సాధించారు,,

కుర్రకవులు పెద్ద కవులను ఇట్టే దాటుకు పోలేనట్టే బాలి కూడా ముందు తరం పెద్ద చిత్రకారుల ను దాటేసి పోలేదు,,కానీ స్వీయ ముద్రలో తీసిపో లేదు,లేత రంగులు,సరసరా పాకే గీతలతో ఆయన వేసిన బొమ్మలు తెలుగు వారి మనసుల్లో చెరిగి పోవు,,సాహిత్య పత్రికల సంఖ్య తరిగిన గానీ, నమస్తే బాలి గారు... అక్కడా బొమ్మలు కట్టి పెట్టకండి సారూ! ❀

# మృత ప్రపంచం నుంచి వొక లేఖ

- ఇంద్రవెల్లి రమేష్, 86392 93560

ప్రియమైన శీనూ,

పూర్తిగా అర్థంకాని పాట నాకెప్పుడూ ఇష్టమే' అని రాసావు.

దగ్ధమైనా సూర్యుడినే కౌగిలించుకుంటాను' అని రాసావు.

సమస్త ప్రపంచం దిగ్భ్రమ చెందేలా ఒక్క వురుం వురమాలి' అని రాసావు.



సాధికారికంగా గ్లోబుపైన నిలబడి అంతరిక్షం తలుపులు తెరవాలి' అని రాసావు.

ఈ తారెత్తే వాక్యాలు ఇప్పటికీ మమ్మల్ని 'వెంటాడుతున్న జ్ఞాపకం' నువ్వు చేయగలిగినంత పనీ చేసావు. కవిత్వానికి కార్యకర్త అయ్యావు, మూసల్ని బద్దలు గొట్టావు. ఒక తరంపాటు సాహిత్యానికి ఉత్తేజం ఇచ్చావు. ధిక్కారంతో పీఠాలు వొణికించావు, నిజమైన అమరవీరుడివయ్యావు.

నీ లెక్కపెట్టలేని సాహసాల గురించి ఎంతైనా రాయవచ్చు. ఉదాహరణకు:

తక్కువ వయసులో ఈ వృద్ధ ప్రపంచంనుంచీ విరమించడం, ఆ కవులతో పోలిక అక్కర లేకపోయినా కీట్స్, షెల్లీ ఆ పని చేసారు కదా! రెండే కవితలు పలికి రూయా విజయుడూ ఆ పని చేసాడు.

దామూ 'ప్రవాహగానం' పరిచయం చేస్తూ 'విప్లవకవిత్వంలో సెక్స్' చర్చకు దారితీయడం. అది ఆ తరువాత సంవత్సరం పాటు అన్ని పత్రికల్లో కొనసాగిందిలే. పుస్తకంగా వచ్చి గడబిడ చేసిందిలే. విప్లవ రచయితల సంఘం అనే సాహిత్య సంస్థ నుంచీ మాకు శిక్షలూ పడ్డాయిలే.

రోజూ ట్యాంకు బండ్ చూస్తున్నపుడల్లా గుర్తుకొస్తావు. లక్డీకపూల్ ద్వారా వెళుతున్నపుడల్ల గుర్తుకొస్తావు. మనం నిన్న మొన్ననే తిరుపతి అంబేడ్కర్ భవన్‌లో 'చిక్కనవుతున్న పాట సభ జరిపినట్లుంది. సభ ఒక వైపు జరుపుతుంటే, మరోవైపు నువ్వు పుస్తకాలు అమ్ముకుంటూ కూర్చున్నావు, గుర్తుందా? మా ఎస్వీయూ ఇంజనీరింగ్ హాస్టల్‌కు చలపతీ, నువ్వూ వచ్చిపోతున్నది గుర్తే ! మదనపల్లి కోర్టుకు వాయిదాకు వచ్చినపుడు 'ఇపుడే కవిత్వ జాతీయ సదస్సు నుంచీ నేరుగా వస్తున్నా అనీ, తెలుగుకవుల్లో అజంతాకు ఒక్కడికే ఆ సదస్సు ఆహ్వానం ఉందనీ చెప్పింది ఇపుడే మళ్లీ వింటున్నాను. ఆ రోజు నువ్వు నల్లటి డ్రస్సులో దిగావు. బాగాగుర్తు, సినిమా యాక్టరులా ఉన్నావు.

ఇంకేం చెప్పగలను, కులం సమాజంలో వేళ్లూనుకుంటోంది, కార్పొరేట్ సెక్టార్‌లో మరీనూ. నువ్వు పుట్టిన కులం వేరు. అయినా సామాన్యకులాల్లో నువు తెచ్చిన ఉత్తేజం గొప్పది. ఆ కులాల సాహిత్యానికి నీ సేవ గొప్పది. ఇపుడెవరున్నారని? వేళ్ల మీద లెక్కపెట్టేందుకు కూడ తక్కువే. నిన్నటి డెమోక్రట్లు, రెవల్యూషనరీలు.. అందరూ అటే కొట్టుకుపోతున్నారు. నోటి తో మాట్లాడుతూ నొసటితో వెక్కిరిస్తున్నారు.

సరే ఇక. కొత్తగా హైటెక్ మూసలు బుసలు కొడుతున్నాయి. కవిత్వంలేదు కళలు లేవు, ఫీలి ంగ్స్ లేవు. ప్రేమలు లేవు, ఉద్యమాలు లేవు. ఒకే కంప్యూటర్లు, టీవీ ఛానళ్ల గోల, మురుగు. అమెరికా మోజుతో కబుర్లు. ఒక అడుగు నిలిచే తీరిక లేదు. మనిషిని మనిషి కావిలించు కోవడం అరుదు. రోగాలు, కాలుష్యాలు, స్వార్థం, అహంకారం. ఒక చిన్నపాటి అభిప్రాయ భేదం లేదు. అంతా పొగడ్తలు. లేదా వెన్నుపోట్లు, కుట్రలు మిత్రుల్నుంచే.

అన్నట్టూ మెద్వెదేవ్ ఆధ్వర్యంలో రష్యాలో క్షీణసాహిత్యం వర్ధిల్లుతోంది. గోర్కీని మరిచారు, టాల్‌స్టాయ్‌ను మరిచారు, దోస్తావస్కీని మరిచారు, చెహోవ్‌ను మరిచారు. ఇప్పుడైతే బీజింగ్ ఒలింపిక్స్ ఉత్సవాల సంరంభం. వొక ఘోరం తెలుసా. మావో పేరు లేకుండా అయిదు వేల ఏళ్ల చైనా చరిత్ర చూపి, ఒలింపిక్సు ప్రారంభించారు. నిన్నమొన్ననే వొచ్చిన వానకు గిరిజన గూడేలకు గూడేలు జ్వరంతో చనిపోతున్నాయి. నిన్ను గుర్తు చేసే ట్యాంకు బండుకు రెండ్రోజుల వర్షానికే ప్రమాదఘంటికలు మోగాయి. ఇదే కదూ ఆధునికత, అ త్యాధునికత, హైటెక్ మూస.

ఎవరేమనుకున్నా మంచి పనే చేసావు. మళ్లీ చెబుతున్నా. ఈ వృద్ధ ప్రపంచం నుంచీ త్వరగా విరమించావు.

చనిపోయి బతికింది నీవు/బతికి చనిపోయింది మేము/మిత్రుల మరణాల మధ్య/ కాలమే వో మహత్యం. ❄

**(17 ఆగస్టు 2008 ఆదివారం వార్త నుండి....)**

## గమనిక

న్యూస్ ప్రింట్ ధరలు, ముద్రణా వ్యయం విపరీతంగా పెరగడం వల్ల 'కవి సంధ్య' పత్రిక పై అదనపు ఆర్థిక భారం పడుతోంది. దీన్ని అధిగమించడానికి తప్పనిసరి పరిస్థితుల్లో పత్రిక వార్షిక చందాను 250రూ. నుండి 300 రూ.లకు పెంచడం జరిగింది. చందాదారులు పరిస్థితిని అర్థం చేసుకుని సహకరించ వలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. గడువు తీరిపోయిన చందాదారులు తమ చందాలను పునరుద్ధరించవలసిందిగా కోరుతున్నాం. - సంపాదక వర్గం

# మనిషి + కవిత్వం - త్రిపురనేని శ్రీనివాస్

**- ముక్కామల చక్రధర్, 9912019929**



"లోపల రసాయనాలున్న మనిషి/ బయట ఉత్ప్రేరితం అవుతాడు/ మెదడు కొసకి నిప్పులంటిస్తాడు/ అతడు సృజనకి జన్మభూమి..."

అవును... ఈ కవిత్వ పంక్తులు రాసిన వాడు సృజనకు మాతృభూమి అయ్యాడు. అతడే ఒకటిన్నర దశాబ్దం పాటు తెలుగు కవిత్వాన్ని శాసించాడు. లాలించాడు. ఉత్ప్రేరితం అయ్యాడు. అందుకే నెలకో మంచి కవిత్వ సంపుటితో కవిత్వాన్ని పండించాడు. ఆ రోజుల్లో ఎవడు మాట్లాడితే, నవ్వితే, నడిస్తే, ఎదురుపడితే, ధిక్కరిస్తే కవిత్వమైందో వాడే త్రిపురనేని శ్రీనివాస్. ఇప్పుడు త్రిపురనేని శ్రీనివాస్ గురించి ఎందుకు మాట్లాడాలి. ఎందుకు గుర్తుకు తెచ్చుకోవాలి అంటే... సాహిత్యపరంగా వెలితి అలముకున్న సమయంలో ఆలంబన కోసం అలమార వెతుకుతూంటే దొరికింది త్రిపురనేని శ్రీనివాస్ రహస్యోద్యం. మూడు దశాబ్దాల క్రితం నాలో నేను అప్పగించుకుంటూ కంఠతా పట్టిన పద్యాల పూలమాల. ఆనాటి అక్షరాల పూలే కాదు.... ఆ దారం కూడా అచ్చమైన కవిత్వ గుబాళింపు. అయినా త్రిపురనేని శ్రీనివాస్ గురించి రాయడానికి సందర్భం అవసరమా... అన్ని సందర్భాలలోనూ అతను స్మరణీయుడే.

"అక్షరారణ్యాలలో కవులు జంతువులుగా మారడం" ఆనాడే చూసిన కవి, కవిత్వ కార్యకర్త త్రిపురనేని శ్రీనివాస్. ఎంత హడావుడిగా సాహిత్యంలోకి ప్రవేశించాడో అంతకంటే వేగంగా నిష్క్రమించాడు. "కవిత్వాన్ని వంచించకు... వచనమై పుడతావ్" అని శపించి... ఓ కవీ... "కవిత్వమై అతనికి కాపాలా కాయి" అని కూడా కర్తవ్య బోధ చేసాడు. ఇప్పుడు వస్తున్న కవిత్వాన్ని ముందే ఊహించాడేమో.. "చెత్తల్ బుట్టల్ మాటల్ రాల్చి కవిత్వమని ఘీంకరించకు" అని త్రి.శ్రీ కోపగించాడు.. ఆ భయం ఇప్పుడు నిజం అయ్యింది. తెలుగు సాహిత్యంలోను, తెలుగు సమాజంలోను ఏదైనా అవాంఛనీయ ధోరణో, అమానవీయ సంఘటనో జరిగితే కచ్చితంగా గుర్తుకొచ్చే పేర్లు రెండే. "వాళ్లే ఉంటే" అని స్ఫురణకొచ్చే మనుషులు ఆ ఇద్దరే. అందులో ఒకరు కె.బాలగోపాల్ అయితే రెండో వ్యక్తి త్రిపురనేని శ్రీనివాస్. "చలపతి ఎప్పుడూ ప్రాణం పోసుకున్న రహస్యంలా ఉన్నాడ"న్న త్రి.శ్రీ నిజానికి అతనే ప్రాణం పోసుకున్న అందమైన కవిత్వంలా ఉండేవాడు.

ఓ పత్రికలో సండే బాధ్యతలు తలకెత్తుకున్న త్రిపురనేని శ్రీనివాస్ ఆ సమయంలో చేసిన మంచి పని చేకూరి రామారావు రాసే చేరాతలు రాకుండా నిలిపివేయడం. అవును, ఆ పని చేయగలిగిన ఏకైక మొనగాడు త్రిపురనేని శ్రీనివాస్ "ఒఖ్ఖడే" అప్పటికి, ఇప్పటికీ,

ఎప్పటికీ. ఆ రాతలే కనుక ఆగకపోయి ఉంటే కొందరు అకవులు ఎంత మంది తెలుగు కవిత్వంలోకి వచ్చి కవిత్వం పేరుతో ఎంత చెత్త రాసేవారో అని నాకు అప్పుడప్పుడు భయం వేస్తుంది. అయితే, విషాదం ఏమిటంటే ఆ కలుషిత కవిత్వాన్ని వెదజల్లే ఫ్యాక్టరీని కొందరు కొనసాగిస్తున్నారు. వీరు చేసుకున్న అదృష్టం.... తెలుగు కవిత్వ దురదృష్టం ఈ సమయంలో త్రిపురనేని శ్రీనివాస్ లేకపోవడం.



ఇప్పుడంటే కింగ్ మేకర్ రామోజీరావు మీద విమర్శలు చేయడం, పుస్తకాలు వేయడం చేస్తున్నారు కాని.. మూడున్నర దశాబ్దాల క్రితమే కేవలం రెండంటే రెండే లైన్లలో.. "ముప్ఫై రోజుల్లో రామోజీ కావడం ఎలా.. (రిక్షా తొక్కి)".. అని వెటకరించిన వాడు త్రిపురనేని శ్రీనివాస్. మనమంతా ఆత్మహత్యలంటున్నాం కాని.. ఆత్మహత్యలన్నీ హత్యలే అని ఆనాడే తేల్చేసాడు త్రిపురనేని శ్రీనివాస్. అంతే కాదు.. దాని రహస్యం గురించి చెప్తూ.. "హతుడే హంతకుడైన చోట హత్య నేరం కాలేదు.. అని నిగ్గు తేల్చాడు త్రిపురనేని శ్రీనివాస్. మనకు ఆ రహస్యం చేరింది కాని.. హంతకుల్లో మనమూ ఉన్నాం కదా.. అందుకే శవ పంచనామాల్లోనూ, సంతాప సభల్లోనూ దొంగ కన్నీరు కారుస్తున్నాం. ఓటరు లిస్టుల్లో పేర్లు నమోదు చేసుకుందుకు ఎంత ఉత్సాహం చూపిస్తున్నామో.. అధునిక హంతకుల జాబితాల్లో కూడా మన పేరు ఉండేలా అంతే తాపత్రయపడుతున్నాం. "చేతిలో ఆయుధం లేనప్పుడు/ నిటారుగా నిలబడిన వెన్నుముకపై ఆధారపడాలి".... అవును శ్రీనూ.. నిజం... నీవన్నది... నీవన్నది నిజం..నిజం.... మా వెన్నుముకలు తునాతునకలయ్యాయి. ❊

**(చక్రవాకం, విశాలాంధ్ర సౌజన్యంతో...)**





## కవిసంధ్య చందాదారులకు విజ్ఞప్తి

కవిసంధ్య, కవిత్వ పత్రిక 2016 ఉగాది పర్వదినాన మొదటి సంచిక వెలువడింది. జనవరి- ఫిబ్రవరి 2023 సంచికతో 40 సంచికలు పూర్తిచేసుకుని, ఏడవ సంవత్సరంలోకి ప్రవేశించింది. పత్రిక ప్రారంభించినప్పుడు చేరిన చందాదారుల్లో అధిక శాతం తమ చందాలను పునరిద్దరించలేదు. అయినా పత్రిక ను పంపుతున్నాం. పెరిగిన పేపర్, ప్రింటింగ్ ధరల కారణంగా పత్రిక పై అదనపు ఆర్థిక భారం పడుతోంది. ఈ నేపథ్యంలో గడువు తీరిన పాత చందాదారులు తమ చందాలను పునరిద్దరించ వలసిందిగా, చందాదారులు కాని వారు చందాలు కట్టవలసిందిగా, వదాన్యులు విరాళాలు ఇచ్చి పత్రిక మనుగడకు సహకరించవలసిందిగా విజ్ఞప్తి...

– కవిసంధ్య సంపాదక వర్గం, యానాం

**Kavisandhya** - Current A/C No. **15571110000236**0
IFSC.Code. UBIN0815578; Union bank of india, Yanam branch 533464
Google Pay: **9848202526**

## నివాళి

# కలకండ పద్యాల కందిపాటి

**- శిఖామణి**



ఏప్రిల్ 4వ తేదీన నెల్లూరులో తీవ్ర అనారోగ్యంతో అకస్మాత్తుగా మరణించిన కందిపాటి గోపాలరావు పద్యం, గేయం, వచన కవితా ప్రక్రియలను సమప్రజ్ఞతో నడిపిన సాహితీ సవ్యసాచి. సెప్టెంబర్ 8, 1957న నెల్లూరు జిల్లా, కావలి మండలం గౌరవరంలో జన్మించారు. అగ్రికల్చర్ బి.ఎ పట్టభద్రులయిన గోపాలరావు వృత్తిరీత్యా బ్యాంకు మేనేజర్‌గా పనిచేసినా, ప్రవృత్తి రీత్యా సంస్కృత, తెలుగు భాషా సాహిత్యాల అధ్యయనపరుడు. దానికి అమ్మానాన్నల సృజన, పఠనాసక్తి కారణం కాగా, తను చదువుకున్న విజయవాడ శాతవాహనా కాలేజీ అధ్యాపక బృందం తనకు రచనా దృక్పథాన్ని ఇచ్చిందని చెప్పుకున్న వినయశీలి గోపాలరావు. 2008లో తన తొలి కవితల సంకలనం 'తొలి సంజ' వెలువరించారు. అది పద్యం, గేయం, వచన కవితల సమాహారం. సంస్కృత భాషా పద గుంఫనంతో కలకండ వంటి ప్రౌఢ పద్య ఖండికలను పలికించారు. వాడుక భాషా పదజాలంతో సరళమైన వచన కవితలనూ వెలయించారు. శ్రీశ్రీ, ఆరుద్ర, సినారెల కావ్యాలు తనకు స్ఫూర్తిదాయకాలు అనీ, పద్య రచనకు మహాకవి గుర్రం జాషువా ప్రేరణ అనీ చెప్పుకున్నారు. ఉదాహరణకు ఒక పద్యం.

"చటులోత్తుంగ తరంగ వీచికల భాస్వదౌతమీవారి, ఖః/నట దుల్లాస విలాస గంగాసలి లౌన్నత్యంబుపై దూకె, తా/ నటు కాటన్ దొరవారి పుణ్యమున సస్యశ్యామలాంధ్రావనీ/ ఘటనోద్యోగమునన్ జనావళిబుభుక్షా వహ్నిచల్లార్చగన్" అని కాటన్ దొరవారి పుణ్యమున గోదావరి నది ప్రజల ఆకలి మంటలను చల్లార్చడానికి ఉద్యుక్తమైన దని ప్రస్తుతిస్తాడు. పద్యంలో గోదావరి నడకల గతులను ప్రతిఫలింపజేశాడు. 2018లో భారతరత్న బి.ఆర్. అంబేడ్కర్ జీవితాన్ని కావ్య వస్తువుగా స్వీకరించి, ఆటవెలదుల్లో 'నీల్ సలాం' శతకాన్ని రచించాడు. 'లాల్ సలాం' స్థానంలో ప్రత్యామ్నాయంగా 'నీల్ సలాం'ను ప్రతిపాదించడం ద్వారా ఎప్పటికైనా ఈ దేశ విముక్తికి అంబేడ్కర్ ప్రతిపాదించిన సర్వమానవ సమతాధర్మమే మార్గమని సూచిస్తున్నాడు. దళిత జాతికి అక్షరభిక్ష పెట్టిన ప్రాతఃస్మరణీయుడు అంబేడ్కర్‌కు అంజలి ఘటిస్తూ...

వ్రాయుటబ్బిన నీ పేరె వ్రాయు వలయు / చదువ నేర్చి నీచరితంబె చదువ వలయు / దళితులెల్లరు తొలుదొల్త దండమెట్టి / విపుల విద్యా సుధార్ణవ! భీమ రావ! నాలుగు మంచి పద్యాలను సాహిత్యానికి మిగిల్చి వెళ్లిన కందిపాటి గోపాలరావుకు 'కవిసంధ్య' అశ్రు నివాళి! ❋

త్రి.శ్రీ.కి నివాళి కవితలు

# హో హోం... హో హోం... బై

- మద్దూరి నగేష్ బాబు



అబద్ధం !
హొ హొం ...
హొహొం బై
త్రిపురనేని శ్రీనివాస్ కోసం
నేన్నమ్మను...!
ఏదేమయినా
నాచేతికర్ర విరిగిపోయిన మాట నిజం
నా నిట్టాడి పట్టుదప్పిన సంగతి వాస్తవం
ఒక రేత్రి కాడ
మా చెర్చి టవర్లోంచి వినపడే పావురాళ్ల ఏడుపా
దూడ పోయిన గేదెకళ్లల్లో కమ్మిన దిగులు మబ్బా
యాడ్నుండి ఎతుక్కుంటా వొచ్చిందిరా
ఆ మాయదారిసావూ
శీనూ
నా మగ్గం గుంటని కన్నీటిగుంటని
శేశావు కదరా
ఈకరెంటుకి ఇంతకీ నిన్ను మసిచేసేంత శక్తేప్పుడు పుట్టిందిరా నాయనా !
ఔను...
నువ్వు చెప్పిందే నిజం
బతుకొక పచ్చి అబద్ధమైపోయినపుడు
మనం ఖచ్చితంగా చచ్చిపోయి తీరాల్చిందే.

**(మీరెవుట్లూ...? సంకలనం నుండి)**

# ఒక ఆఫ్ బీట్ అందాల... బీభత్సపు పనివాడు

- పైడి తేరేష్ బాబు



**శీను ఒకటి**

**1996 ఆగస్టు 20 - హైదరాబాదు నగరం-ఇరానీ రెస్టారెంట్లు-రాత్రిళ్ళు**

వీస్తున్నంతసేపూ గాలి గురించిన చర్చ వుండదు
ఉక్కపోస్తూ వుందిప్పుడు
ఒక్కడు వదిలివెళ్ళిన ఖాళీలో వందమంది కాళ్లు
బారజాపుక్కూర్చున్నా శూన్యం ఇంకా మిగిలేవుంది
విల్లును సిద్ధంచేసి బాణాన్ని కోసుగా చివ్విన విలుకాడు
ఉన్నపళంగా పత్తాలేకుండా పోవడం ఇంకా మింగుడుపడ్డంలేదు
చావు అనే రెండక్షరాల సమాధానం
చాలా కురచగానూ తరచిచూస్తే ప్రశ్నార్థకంగానూ వుంటుంది
ఈ రీలులో కలిసి పక్కరీలులో విడిపోవడానికి
మేమేం సెల్యులాయిడ్ నీడలం కాదు
మిత్రులం సైనికులం
గడియారం ముళ్లను బెత్తాలుగా పట్టుకున్నవాడు
కాలానికి కొత్తరకం అంకగణితం నేర్పినవాడు
లెక్కల్ని తారుమారుచేస్తూ
సింగిల్ కాలమ్ వార్తగా మారిపోవడం అనూహ్యం కదా!
ఒక్క విషయం మాత్రం కరారైంది.
నవ్వుల నయాగరానెవరో ఫోటో తీశారు
ఇప్పుడు ఫోటో వుంది జలపాతం అదృశ్యం
ముల్లు కాస్త లోతుగానే దిగింది
కాస్సేపు దాన్నలా భరించే ప్రయత్నం చేస్తాను.

**శీను నాలుగు**

**1996 ఆగస్టు 7 - బన్సీలాల్ పేట విద్యుత్ శ్మశానవాటిక - పట్టపగలు**

విద్యుత్తై ప్రవహించేవాణ్ని
విద్యుత్తే దహించగలదు అనుకుందాం
పిడికెడు బూడిదమాత్రమే చావుకు నిదర్శనం కాదు గదా

పాళీకన్నా వేగంగా పరుగెత్తడం పద్యాలన్నిటికీ చేతకాదు
సూత్రీకరణల్ని ఎడంకాలితో తన్నినవాడే వీరుడు
ముద్రల్ని నిరసించి ముద్రలేసిపోవడం మిత్రులందరికీ సాధ్యం కాదు
వ్యతిరేకించడానికి పుట్టినవాడే వీరుడు
పాడెకు అందనంత లాఘవంగా కాలిపోవడం శవాలన్నిటికీ చేతకాదు
స్మారకస్థూపాలతో సమాధులతో నేలను కలుషితం చెయ్యనివాడే వీరుడు
కులం ఏదైతేనేం వర్గం ఏదైతేనేం
పిసరంత చోటు కూడా మిగల్చక గుండెల్ని ఆక్రమించుకున్నవాడే వీరుడు
దళితస్వరాన్ని భాస్వరంతో దట్టించి
దగాకోరు గాలిమీదికి చేతికొద్దీ విసరగలిగినవాడే వీరుడు
ముఖ్యమైన విషయమేమిటంటే
ఒక ముప్పైమూడేళ్ల సాహసిక జానపదగాథ ఇవాళే ముగిసింది
"సెబాసు బలుడా
పంటావే నే పండీపోదూనోయ్"
సెబాసు సెబాసు బలుడా బలుడా!
ఇంకా రహస్యమేముంది ఉద్యమమిప్పుడు బహిరంగమే
అది మునుపటికన్నా విస్తృతం!

(త్రిపురనేని శ్రీనివాస్ కోసం)

('అల్పపీడనం' కవితా సంపుటి నుండి...)

కవిసంధ్య

కవి సంధ్యకు చందాలు, రచనలు, సమీక్ష కోసం పుస్తకాలు (రెండు ప్రతులు) పంపేవారు ఈకింది హైదరాబాద్ కార్యాలయం చిరునామాకు పంప వలసిందిగా కోరుతున్నాం.

సంపాదకుడు, కవిసంధ్య, ప్లాట్ నం.61/10, సిద్దార్థ నగర్, వెంగళరావు నగర్, హైదరాబాద్-500038, ఫోన్:7989973805.
Kavisandhya.yanam@gmail.com

# ఆయుధానికి మెరుపునువ్వే

- ప్రసాద మూర్తి, 8499866699



ఈ పువ్వుకోసమే కదా
తోట తోటంతా గంపెడాశ పెట్టుకుంది
ఈ పాటకోసమే కదా
కాలం పిట్ట పచ్చిగొంతుతో పరవళ్ళు తొక్కింది

మిత్రమా!
కవిత్వం నిన్ను రాసుకుని మురిసిపోయింది
మేం నిన్ను చూసుకుని
మమ్మల్ని తెలుసుకున్నాం
యుద్ధం ముగియకముందే
కనుమూశావా కాడ్వెల్
ఈకవిత పూర్తికాకముందే మాయమయ్యావా కీట్స్
ఎంత మాయచేశావు మయకో విస్కీ
నువ్వింత కఠినంగా శిక్షస్తావని ముందే తెలిస్తే
పలకా బలపం పట్టుకుని నీబళ్ళో చేరే వాళ్ళమే కాదు
నువ్వు రహస్యం తోలు తీసిన రహస్యానివి
మనుషుల్లా కనిపించే మనుషుల్లోపల మనిషివి
నువ్వొక సంచలనాల సంకలనానివి
ఒక్క నిజాయితీ వాక్యం కోసం ముప్పయి వసంతాల్ని రాల్చుకున్నవాడివి
నిన్ను కసిదీరా ముద్దు పెట్టుకునైనా
గాయపడ్డానికే మేమంతా సిద్ధమయ్యాం కదలని బండలకేం కోకొల్లలు
కొండల్ని ఢీకొట్టడం నీనుండే నేర్చుకోవాలి

స్నేహితుడా!
నువ్వు లేవని మనవాళ్ళంతా
ఎంత దిగులుపడి పోతున్నారు
మరి మాచేతుల్లోని ఈ ఆయుధానికి వచ్చిన
కొత్తమెరుపు మాటేమిటి?

(త్రిపురనేని శ్రీనివాస్ కోసం)

('కలనేత' కవితా సంపుటి నుండి-1999)

# ఒక కవిత్వ కథ

- గోపీచంద్ త్రిపురనేని



ప్రత్యేకంగా ఉన్న ఒక మనిషి
అందరిలా మామూలుగా మరణించడం
బాధగా వుంది...
'అరేయ్... రోజూ ఒకేలా వుండొద్దురా
నీ సంతకంలా భిన్నభిన్నాలుగా వుండరా
కవిత్వం రాయరా...
కవిగానే చావరా' కవిత్వాన్ని కావలి
కాసిన
నిజమైన పహరా వాడు
ఇజాల హజాలతో కొట్టుకుపోతున్న
విప్లవాగ్నిని
నేల బాట పట్టించిన నేస్తం వాడు
ఆకాశమంతా మీకే ఇస్తానని
వాగ్దానం చేసిన లెస్బియన్ వాడు
గూడెంలోని వారిని గుండెలమీదకు
ఎక్కించుకు మోసిన తొలి దళితుడు
వాడు
ఎంత అందంగా నవ్వుతాడో
అంత కఠోరంగా దగడం తెలిసిన
మ్యుజీషియన్ వాడు
రాంగోపాల్ వర్మనే
భయపెట్టిన
'దెయ్యం' వాడు
రేయ్ శీనుగా....
కవిత్వం ఇంకా బతికే ఉందిరా..
నువ్వేం బెంగపెట్టుకోకు
పన్నెండు వసంతాల సాక్షిగా
చెబుతున్నా...
అజంతా రోజూ ఫోన్ చేస్తూనే ఉన్నాడు
'మో'యేమీ అసలు వడలలేదు.
'గాలి' నాసరం వీస్తూనే ఉంది...
సౌదా అస్త్ర సన్యాసం చేశాడు.
పిరికి వాళ్ళు... కెరీరిస్టులు మాత్రం
పారిపోయారు
రకరకాల వాదాల ముసుగులో
కులాలు, మతాలు పేరు మీద
కుంపట్లు పెట్టేసుకున్నారు
కానీ కవిత్వం మాత్రం బతికే వుందిరా
నీ చిక్కటి అందమైన చిరునవ్వులా!

**(సాక్షి దినపత్రిక-18 ఆగస్టు 2008 నుండి...)** ❊


## కవి సంధ్య చందాలు ఆన్‌లైన్‌లో చెల్లించవచ్చు

| | | | |
|---|---|---|---|
| సంవత్సరం చందా | రూ. 300 | 2 సం.రాల చందా | రూ. 600 |
| 4 సం.రాల చందా | రూ. 1,200 | 5 సం.రాల చందా | రూ. 1,500 |
| విశిష్ట చందా | రూ. 5,000 | జీవిత సభ్యత్వం | రూ. 10,000 |

**A/c. No. 15571110000236O, IFSC code :UBIN 0815578,**
**Union Bank of India, Yanam Branch (or) Google Pay to 9848202526**

# డా. వరుగు భాస్కరరెడ్డి, ముమ్మిడి చిన్నారిలకు
# కళైమామణి పురస్కారాలు






'కవిసంధ్య' పత్రిక వ్యవస్థాపక సభ్యులు, వర్కింగ్ ఎడిటర్ డా. వరుగు భాస్కర్ రెడ్డి, సంపాదకవర్గ సభ్యులు ముమ్మిడి చిన్నారిలకు పుదుచ్చేరి ప్రభుత్వం ప్రతిష్టాత్మక కళైమామణి అవార్డులు ప్రకటించింది. ఈ మేరకు పుదుచ్చేరి ప్రభుత్వ ఆర్ట్ అండ్ కల్చర్ శాఖ డైరెక్టర్ ఒక ప్రకటనలో తెలియచేశారు. పురస్కారాలు ఏప్రిల్ నెలాఖరుకు పుదుచ్చేరిలో ప్రదానం చేస్తారు.

డా. వరుగు భాస్కర్ రెడ్డి ప్రస్తుతం డా. సర్వేపల్లి రాధా కృష్ణన్ ప్రభుత్వ ఆర్ట్స్ కళాశాల, యానాంలో ప్రిన్సిపాల్‌గా విధులు నిర్వహిస్తున్నారు. డా. భాస్కరరెడ్డి హైదరాబాద్ సెంట్రల్ యూనివర్సిటీలో ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారి పర్యవేక్షణలో 'సంజీవదేవ్ సౌందర్య తత్వం' అంశంపై ప్రామాణిక Ph.D పరిశోధనా గ్రంథం రాశారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, ప్రచురణల విభాగం వారు ఆ గ్రంధాన్ని ప్రచురించారు. అలాగే ప్రముఖ భాషా శాస్త్రవేత్త 'చేరా' గారితో కలిసి 'పత్రికా పదకోశం' తయారుచేశారు. ఇది ఔత్సాహిక జర్నలిస్టులకు కరదీపిక. ఇంకా స్థానిక యానాం ఓల్డేజి హోమ్ సేవాకార్యక్రమాలు గురించి పుస్తకం రాశారు. యానాంలో కవిసంధ్య నిర్వహించిన అన్ని సాహిత్య సదస్సులకు భాస్కర్ రెడ్డి ప్రధాన సూత్రాధారిగా వ్యవహరించి సమర్థవంతంగా నిర్వహించారు.

ముమ్మిడి శ్రీ వీరనాగ ప్రసాద్ (చిన్నారి) యానాం, రాజీవ్ గాంధీ ఇంగ్లీష్ మీడియం హైస్కూల్‌లో క్రాఫ్ట్ టీచర్‌గా పనిచేస్తున్నారు. కవి, చిత్రకారుడు. అనేక సాహిత్య గ్రంధాలకు ముఖచిత్రాలు వేసారు. అనేక మంది ఫేస్‌బుక్ మిత్రులకు ప్రీతిపాత్రుడు. వందలాది కాదు కాదు వేలాది ముఖాల్ని సౌందర్యభరితంగా తీర్చి కనువిందు చేస్తుంటారు. కవిసంధ్య సభలకు వ్యాఖాతగా మాత్రమే కాదు, సభలకు యానాం వచ్చిన సాహితీ ప్రముఖుల పోర్ట్రేయిట్స్ వేసి బహుకరించారు.

యానాం ఊరంతా ప్రహరీ గోడల మీద అర్థవంతమైన సందేశాత్మక చిత్రాలు చిన్నారి అద్భుత కళాకౌశలానికి నిదర్శనాలు.

కవిసంధ్య ఆత్మ బంధువులైన డా.భాస్కర్ రెడ్డి, శ్రీ చిన్నారిలకు కళైమామణి పురస్కారాలు ప్రకటించడంపట్ల 'కవిసంధ్య' సంపాదక వర్గం హార్దిక శుభాకాంక్షలు తెలియ చేస్తుంది. ❋

– కవిసంధ్య డెస్క్

# మహావక్త బాలశ్రీనివాస మూర్తి

- డా॥ ఏనుగు నరసింహారెడ్డి, 8978869183



సాహితీ మిత్రులు ఎవరూ మరిచిపోని ప్రసంగాల ఫీచర్ తెలంగాణా సాహిత్య అకాడెమి నిర్వహించిన 'కావ్య పరిమళం'.

2019 మార్చి ఒకటిన పల్లా దుర్గయ్య కావ్యం 'గంగిరెద్దు' మీద డా॥ గుమ్మన్నగారి బాలశ్రీనివాస మూర్తి ఒక గంటకుపైగా గుక్క తిప్పుకోకుండా మాట్లాడాడు. తెలంగాణ సాహిత్య అకాడెమీ లక్ష్యం చప్పట్ల రూపంలో సభికుల నుండి వ్యక్తమయింది. పన్నెండు కావ్యాలు, పన్నెండు మంది వక్తలను శ్రద్ధగా వింటున్ననాకు బాలశ్రీనివాస్‌లోని వక్త కొత్తగా ఆరోజు నన్ను మహదానంద పరిచాడు. అపారమైన విషయ పరిజ్ఞానం, విస్తారమైన అధ్యయనం, ఉదాహరణలతో కూడిన ఉపకరణాల వినియోగం, సమయ స్ఫూర్తి, ఔచిత్యం వెరసి తనను గొప్ప వక్తగా నిలిపిందని తర్వాత విన్న అనేక ఉపన్యాసాల ద్వారా నేను ధృవపరుచుకున్నాను. వందకు పైగా సదస్సుల్లో పత్రసమర్పణలు చేసినా తన ప్రసంగాన్ని స్వతంత్ర ఉపన్యాసంగానే కొనసాగించేవాడు మూర్తి. తెలంగాణతో పాటు ఆంధ్రప్రదేశ్ లో కూడా ఆహ్వానం మేరకు హాజరై ప్రసంగించేవాడు. తన వాగ్ధాటి కోసమే తననందరూ వక్తగా పిలుస్తారన్నది సాహిత్య మిత్రులందరికీ తెలుసు. కరీంనగర్ లో తెరవే మిత్రులు 'తెలంగాణ రుబాయిలు' పరిచయసభ పెట్టినప్పుడు ఎం.నారాయణ శర్మతోపాటు హైద్రాబాద్ నుండి బాలశ్రీనివాస మూర్తిని ప్రత్యేకంగా ఆహ్వానించింది అందుకే.. ఇక అప్పటి నుండి బాలన్నతో పోటీపడి ఓడిపోతూనే ఉన్నాను నేను. వక్తృత్వంలో నన్ను ఎలాగైనా గెలిపించాలని జీవన హిందోళంలో, విలక్షణ పీవీలో, తెలంగాణ యునివర్సిటిలో అనేక సార్లు మాట్లాడించాడు. సాహితీసుధ, తెలంగాణ సాహిత్య చరిత్ర గ్రంథావిష్కరణలలో మాట్లాడించాడు. నన్ను అక్కున చేర్చుకున్న ఆత్మీయ మిత్రుడు. వాళ్ళ నాన్న లక్ష్మీ నరసింహశర్మ లాగే తెలంగాణ గర్వించదగ్గ విద్వత్ సంపన్నుడు.

పత్రికా రచయితగా, ప్రైవేటు లెక్చరర్‌గా, గ్రూప్స్ కోచ్‌గా, విశ్వవిద్యాలయ ఆచార్యుడిగా లెక్కకు మిక్కిలి పుస్తకాలు చదివాడు. విమర్శను ప్రత్యేక ఆసక్తిగా పెట్టుకొని అనేక పుస్తకాలు రాసాడు. అనేక పుస్తకాలకు సంపాదకత్వం వహించాడు. ఆయన రచనల్లో 'ఆత్మకథల్లో అలనాటి తెలంగాణ' గొప్ప పరిశోధనాగ్రంథం. తెలంగాణ ఉద్యమానికి అది పరోక్ష భూమికని సమకూర్చింది. 'వెలుతురు కొలను'లో సున్నితమైన వ్యాసాలు మూల రచనల మీద పాఠకులకు ఆసక్తి పెంచుతాయి. 'విలక్షణ పీవీ

**(మిగతా 63వ పేజీలో...)**

## త్రి.శ్రీ. స్మృతిలో...

# అన్వేషి, సాహసి

**- మో**



'కళ'లో చివరి వరకూ ప్రయాణించాలి' అని రాసుకున్న త్రిపురనేని శ్రీనివాస్ చాల తక్కువ కాలంలోనే చాల ఎక్కువ దూరం ప్రయాణం చేశాడు. ఆ త్వరిత గమనంలో గమ్యం కంటే గమనమే ప్రధానమైపోయి 'నాలుగు సరాసరి రస్తాలను పెనవేసి ముడివేసి జడవేసి' పథికుడైన తానే పథనంలో ఆధునిక మాంత్రికుడిలా రోడ్డె హఠాత్తుగా ఆగిపోయాడు. రోడ్డు మీద రోడ్డు నడిచింది.

అతను ఉద్యమాలలోంచి సింగిల్ సెల్‌లోకి వెళ్ళి ఆ రెండిటిలోంచి బయటపడి ప్రయోజన మార్గంలోంచి ప్రయోగ పథంలో కవిత్వ ప్రచురణ పథకంతో మళ్ళీ ఉద్యమించి ఎప్పుడూ సంతకం ఒకేలా పెట్టకుండా చూసుకొంటూ శాశ్వతంగా లంగరేసిన పడవలా ఇల్లు వాకిలి ఇల్లాలికి పాతుకుపోక బాహ్యాంతర నేత్రాల్ని విప్పుకుంటూ మనస్సెలయేరులోకి స్వప్నలాలసలోకి స్వర్శలాలనలోకి అనుభూతి శిఖరాగ్రాన్ని చేరుకునే మౌనాలాపనలా ఉద్విగ్నతలోని భగ్నతలోకి రాలిపడి పోయాడు-మెరుపులా.

స్వాప్నిక ప్రతీకల్ని జేబులో పెట్టుకు తిరిగాడు. జీవితాన్ని రహస్యంగా ఆవిష్కరించుకున్నాడు. 'నా సూర్యోదయానికి ఒక్క ఆకాశం చాలదన్నాడు. 'మాటనే నౌకలమీద మౌన తీరా'లని చేరుకున్నాడు.

కాపిటల్నుంచి అనుక్షణికం నుంచి స్వప్నలిపి దాకా-మధ్యలో గురిచూచి చిక్కనవుతూ పదునెక్కుతూ-నామవాచకాన్ని సర్వనామం చేయకుండా తన ఛాయిస్ ఏదో తను చూసుకున్నాడు. తన ఆల్టర్నేటివ్ ఏదో తను వెతుక్కున్నాడు - కవిత్వం మిత్రులకు ఓ వెంటాడే జ్ఞాపకంలా ఓ ఖడ్గచాలనంలా.

# సంతకం ఎప్పుడూ ఒకేలా చేయలేనివాడు

**- ఓల్గా**



శ్రీనివాస్ గురించి ఏం రాయాలి? కానీ అతని గురించిన జ్ఞాపకాల్లో, ఫీలింగ్స్‌లో పంచుకోవటం కంటే యిప్పుడు చేయగలిగింది ఏముంది? అతని గురించి తెలియనిది ఎవరికి? సాహిత్యంతో, సాంఘికోద్యమాలతో సంబంధం వున్న వారందరికీ శ్రీనివాస్ ఏమిటో తెలుసు. అతను గొప్ప కవి-ఈ దశాబ్దంలో వచ్చిన రెండు

సాహిత్యోద్యమాలనూ తన చేతుల మీదుగా నడిపినవాడు. కొత్తను ప్రేమించేవాడు. కొత్తదారులను వెతుక్కుంటూ ప్రయాణించేవాడు. ఈ అక్షరాలెంత పేలవంగా వున్నాయో నాకు తెలుస్తూనే వుంటే ఏం రాయగలను? అతని రక్తాన్ని పరిచయం చెయ్యటం ఎంత కష్టం?

పది సంవత్సరాలపాటు అతనితో మంచి స్నేహం కుదరటం అదృష్టమే అనుకోవాలి. ఎలాంటి సమయంలో అతను నా స్నేహంకోసం వచ్చాడో, నా చేయిపట్టుకుని నేనున్నానని చెప్పాడో జ్ఞాపకం వస్తే కన్నీళ్ళాగవు. అతను సాహసాన్ని ప్రేమించే వాడు. అందరినీ, అన్నిటినీ ఎదిరించే గుణాన్ని ప్రేమించేవాడు. ఉన్న విలువలతో తృప్తిపడక మరింత మానవీయమైన విలువలకోసం తపనపడేవాడు. కవిత్వంలో రాయటం కాదు – నిజంగానే ఎప్పుడూ ఒకేరకంగా సంతకం చెయ్యలేనివాడు.

అట్లా అతి సులువుగా చేయగలిగిన ఈ మానవ సమూహాన్ని చూసి విస్తుపోయేవాడు. 'ఈ మధ్య కవిత్వం రాయటం మానేశావు శ్రీనివాస్– రాయాలి నువ్వు' అని అంటే – 'ఎందుకు రాయాలి? ఒకసారి కవిత్వం రాస్తే యిక జీవితాంతం కవిత్వమే రాయాలా? నేను రాయను. కిల్లీ కొట్టు నడుపుతాను. టైర్లు అమ్ముతాను. ఒకే పని అరిగి అరిగిపోయేలా దానిలో జీవమం తా చంపేదాకా నేను చస్తే చెయ్యన'నేవాడు. ఈ జీవిత విధానాన్ని అర్థంచేసుకోలేనివాళ్ళకు శ్రీనివాస్ అరాచకవాదిగానో మరోరకంగానో కనిపించేవాడు. శ్రీనివాస్‌ని అర్థం చేసుకోగలిగి నవాళ్ళకు అతనెంత బాధ్యతగా వుంటాడో తెలిసి ఆశ్చర్యం కలిగేది. ఏ పనైనా తలపెడితే అది సంపూర్ణంగా, భిన్నంగా, సౌందర్యవంతంగా చేయటం శ్రీనివాస్ కి తప్ప మరొకరికి సాధ్యంకాదనిపించేలా చేసేవాడు. ఇలా ఎంతైనా రాయొచ్చు. నిలువెల్లా కవిత్వం ప్రవహించేవాడిని అక్షరాల్లో ఇమడ్చడం నాకు చేతకాదు.

## లోపల సరస్సులున్నాయి అతనికి...

– త్రిపుర



ఒక్క సాహసం చేయాలి, సమస్త మానవాళి ఆశ్చర్యపడేలా ఎవరి రక్త చలనంతో వారు అంటూ ఇక అన్వేషణ. కలలన్నీ ఒక పెట్టెలో, ఆఖరుగా దిగువన ఓ భ్రమ. దానికింద శూన్యం. ఆ శూన్యంలో మెరుస్తోన్న ఒక ఊహారేఖ. దాని కోసం అన్వేషణ. ఆ అన్వేషణ ఎప్పుడు ప్రారంభం అయిందో మనకు తెలుసా?.

ఎప్పుడు కలుసుకున్నా నవ్వే అమాయక ప్రశ్నలు, తెలీక కాదు, శోధించడానికి, లోపల సరస్సులున్నాయి అతనికి. అందుకే బయట సముద్రాల్ని

సృష్టిస్తాడు. ఆకాశానికి-దట్టమైన సోమరితనపు ముసలి మేఘాలు కప్పేసుకున్నా- అలాపన నేర్పుతాడు. ప్రవచనాలు ఎప్పుడూ పలకలేని అతను, సంతకం ఎప్పుడూ ఒకేలా చేయలేని అతను చిట్టచివర రాసే కవితలో మొట్టమొదటి అక్షరంగా అతను, ఒక్క ఆకాశం తన మొదటి సూర్యోదయానికి చాలని అతను, బాధనుంచి బరువైన విశ్వాసాన్ని మోసుకొొచ్చి మనుష్యుల్లోకి ఒక కవిత్వంగా ఒక తిరుగుబాటుగా ఒక మార్పుగా విసిరేసిన అతను ఎవరూ లేని కిటకిటలోకి యిలా వెళ్లిపోతే.

ఇదంతా అతను అనుకున్నదే. అన్నదీ అతనే. మధ్యని మన మెందుకు ఒకరి కన్నీళ్ళనొకరు తుడుచుకోడానికి చేసే వ్యర్థ ప్రయత్నంలా మిగిలిపోటానికి తప్ప.

## Meeting, an accident
## Missing still, greater accident!

\- స్మైల్



మొన్న రాత్రి కురిసిన వాన ఇవాళ కురవటం లేదు. భూగోళా నికి దగ్గరగా వచ్చి నిలిచి ఉన్న తోకచుక్క ఒకటి వ్యవధి అయి పోయి అనంత విశ్వంలోకి దూసుకు వెళ్లిపోయింది. త్రిశ్రీ యివాళ లేదు. ఎప్పుడో ముప్పయ్యేళ్ళ క్రితం చదివిన ఒక యింగ్లీష్ కవిత జ్ఞాపకం వొస్తోంది. 'హాలే' తోకచుక్క 76 యేళ్లకొకసారి భూలోకవాసులకి ఆకాశాన దర్శనమిస్తుందన్న వాస్తవం మీద కవిత అది. 1901లోనూ, ఆ తర్వాత 1986లోనూ కన్పించిన హాలే తోకచుక్క మళ్ళా 2052లో కన్పిస్తుంది. దాన్ని ఉద్దేశిస్తూ కవి అంటాడు.

“నువు క్రితం సారి వచ్చినప్పుడు నేను పుట్టనే లేదు/ నువు మళ్లి తిరిగి వచ్చినపుడు/ బహుశా యీ ప్రపంచానే వుండనేమో నేను/ జీవితంలో మంచి స్నేహితులు కూడా యింతేనేమో/ ఎప్పుడో తప్ప తారసపడరేమో!” పుటకా ఒక్కసారే చావూ ఒక్కసారే కాబట్టి నేను స్నేహితుల్ని అపురూపమైన వాళ్ళుగా భావించుకుంటాను. త్రిశ్రీ నాకు 1986 నుంచీ తెలుసు. అంటే నేను హాలే తోకచుక్కని 1986 లో చూసినప్పట్నుంచీ తెలుసు. అతనూ చూసి ఉంటాడు. 2052కి నాకైతే అసంభవం కానీ త్రిశ్రీ వెళ్లిపోకుండా వున్నట్టయితే, అతను హాలేని చూసి వుండేవాడేమో!

87 నుంచి 90 వరకూ నేను విజయవాడలో ఉన్నప్పుడు ఎంత తరచుగా కలిసేవాళ్ళమో చెప్పలేను. బాగా దగ్గరయ్యాడు. అప్పట్లో నేనూ, సురేంద్రరాజూ, త్రిశ్రీ విశ్వకవిత ఉత్సవాలకి భోపాల్ వెళ్లాం. ఓ వారం వున్నాం. అక్కడికి వెళ్ళి వచ్చిన సంఘ టన త్రిశ్రీ కవితా జీవితంలో గొప్ప ముద్ర, గొప్ప మలుపు అనుకుంటాన్నేను. భోపాల్లోనూ, అక్కడ్నుంచి వచ్చిన తర్వాత మేంచాలాసార్లు కలుసుకున్న సందర్భాల్లో మంచి కవిత్వం ప్రచురించాలని, భోపాల్‌లోలా కవిత్వ సభలు నిర్వహించాలని. ఎన్నో కబుర్లు సీరియస్‌గానూ, అన్ సీరియస్‌గానూ, మో, ఖాదర్, అఫ్సర్, అప్పుడప్పుడూ పురాణం

శర్మ, అజంతా, యింకా ఎందరో యీ కవితా గాన పాన లహరిలో. అయితే భోపాల్ కవిత్వపు కిక్ లోంచి వచ్చిన అయిడియాకి త్రిశ్రీ రూపం యిచ్చాడు. కవిత్వం ప్రచురణలు వచ్చాయి. ఆంధ్రప్రదేశ్‌లో యువకవులు ఒక కొత్త కవితాలోకంలోకి మేల్కొన్నారు. దీనికి పరోక్షంగా నేను కారణం అవటం, దీనికి సంబంధించిన మొదటి మాటామంతీ విజయవాడలో మా ఇంట్లో జరగటం తల్చుకుంటే ఎంత ఆనందంగా ఉంటుందో, ఇప్పుడు యితను వెళ్ళిపోయిన హఠాత్ సందర్భంలో అంత బాధగానూ ఉంది.

కవిత్వం, కవిత్వం అని కలవరించి, పలవరించిన యువ మిత్రుడు ఓ బీడు ప్రదేశాన భళ్ళున వానలా కురిసి, వెలిసి వెళ్ళి పోయాడు. అతని జీవన దృక్పథానికి, కవిత్వ దృక్పథానికి అట్టే తేడా ఉన్నట్టు కన్పించదు నాకు. సామాజిక బాధ్యత కంటే అత ను కవిత్వ బాధ్యతను ఎక్కువగా ప్రేమించినట్టు అన్పిస్తుంది నాకు. ఒక కవి వికాసంలో విశాల హృదయంది పెద్ద పాత్ర, అందువల్లే కవులు అందాన్ని ప్రేమించటమే కాదు, అన్యాయాన్ని కూడా అంతగా ద్వేషిస్తారు. తమ పద్ధతిలో తిరగబడతారు. రహస్యోద్యమాలు చేస్తారు. త్రిశ్రీలో ఈ తిరుగుబాటు, ఒక ఉద్యమపు ఊపు మనకి స్పష్టంగా కన్పిస్తాయి. అందువల్లే అత ను నాకు యిష్టం. అందువల్లే అతన్ని తలుచుకుంటే యిప్పుడు నేను కన్నీటి చుక్కనై పోతున్నా!

## అతని సాహసానికి "కవిత్వం ప్రచురణలు" గుర్తులు

**- చేరా**



బహుశా 1989 అనుకొంటాను. తిరుపతిలో త్రిపురనేని మధుసూదనరావు ఇంట్లో ఉండగా ఎర్రగా బుర్రగా ఉన్న చురుకైన కుర్రాడు వచ్చాడు. ఆతనే శ్రీనివాస్ అని మధుసూదనరావు పరిచయం చేశాడు. శ్రీనివాస్ మధుసూదనరావును బాబాయి అని పిలుస్తాడు. అప్పుడు ఉదయంలో పనిచేస్తున్నాడు.

ఆ తర్వాత రహస్యోద్యమం పుస్తకం వేసినప్పుడు 'చేరా గారికి దబాయింపుగా" అని రాసిచ్చాడు ద్వారకాలో కలిసి. చేరాతలు రాస్తున్న రోజులు. ఇగ్నోర్ చెయ్యదగిన కవికాదు. అతని కవిత్వం నచ్చింది. దబాయింపులు నచ్చలేదు. అదే రాశాను. అతనికి నచ్చలేదనుకుంటాను. పత్రికలో ఇద్దరం కొంత పేచీ పడ్డాం. అయితే అదే మనసులో పెట్టుకొని నేనూ లేనూ, అతనూ లేడు. తరవాత చాలాసార్లు విజయవాడలోగాని హైదరాబాదులో కాని కలుసుకుంటూ ఉండేవాళ్లం.

అతని కవిత్వప్రచురణలను నేనూ అహ్వానించాను. అంటే ఆ పుస్తకాల మీద రాశాను. అతని సాహసానికి ఆ ప్రచురణలు గుర్తులు. నాసరరెడ్డి, త్రిపుర, స్మైల్‌ల కవిత్వం పుస్తకాలు మొదటవేసింది. అతనే. అజంతా కవిత్వాన్ని అనేక ఆటంకాలను దాటించి బయటకు తీసుకురాగలిగాడు. మొదటి స్త్రీ వాద కవితా సంకలనం అచ్చేసిన

క్రెడిట్ అతనిదే. ఆంధ్రజ్యోతి ఆదివారం అతని చేతికొచ్చింది. చేరాతలు ఆపేస్తాడని చాలామంది ఆశించారని అతనే అనేవాడు. కాని ఆ పని చెయ్యలేదు. అయితే ఒక కొంటెతనం చేస్తుండేవాడు. తనకు నచ్చిన పీస్ అయితే బాగా హైలైట్ చేసేవాడు. నీలిమేఘాల మీద, రాజకీయకథల మీద రాసి నప్పుడు పేజ్ మేకప్ అద్భుతంగా ఉండేది. అదే ఏ పద్య కవిత్వం మీదనో, ఆధ్యాత్మిక కవిత్వం మీదనో రాసినప్పుడు ముక్కలు చేసి వేసేవాడు. ముక్కలుగా విరిచి వేస్తే నాకే ఆర్థికంగా కొద్దిగా లాభం! భాష మీద రాసినప్పుడు మీ రీడర్‌షిప్ తగ్గిపోతుందని హెచ్చరించేవాడు. ప్రీతిష్ నంది కవిత్వాన్ని అతను అనువాదం చేశాడు. వాటి ఇంగ్లీషు మూలాలు కూడా అడిగితే, అతనే నాకిచ్చాడు. కవిత్వానువాదం లో సాధక బాధకాలను గురించి విపులంగా చర్చించాను. అయినా అక్షరమ్ముక్క తొలగించకుండా అచ్చువేశాడు. తనకు నచ్చక పోయినా నా వ్యాసాల మీద చెయ్యి చేసుకునేవాడు కాదు. నచ్చని దాన్ని కూడా సహించే ప్రజాస్వామ్య దృక్పథం నాకిష్టం అది అతనిలో కనిపించింది!.

చిన్నవాడైనా చాలా విలువైన పనులు చేశాడు. ఇంకా చాలా చెయ్యగల శక్తి ఉంది. మృత్యువుకు విచక్షణ జ్ఞానం ఉండదు. అందరినీ కబళిస్తుంది. అతను చేసిన మంచి పనులు పదే పదే గుర్తు చేసుకోటమే మనం చెయ్యగలిగింది. ❊

---

**(54వ పేజీ తరువాయి...**

నరసింహారావు జీవిత చరిత్ర' దివంగత పీవీని నలుపు తెలుపులో నిలబెట్టిన బయోగ్రఫీ. సమకాలీన వాదాలు-సాహిత్య విమర్శ, తెలంగాణ పత్రికలు, తెలంగాణం-తెలుగు మాగాణం, తుషార సమీరం తదితర విలక్షణమైన రచనలు బాల శ్రీనివాస్ ఆలోచనా ధోరణికి అద్దం పడతాయి. మా ప్రసిద్ధిపేట, జీవన హిందోళం ఆత్మకథాత్మక రచనలు. ఇవి కాకుండా జన నేతలు, అక్షర మూర్తులు, ప్రతిభా మూర్తులు, తెలంగాణ చరిత్ర సంస్కృతి వారసత్వం, సాహితీ సుధ, తెలంగాణ సాహిత్య చరిత్రలకు సంపాదకత్వం వహించి విశేష సారస్వత సేవ చేసాడు. అధ్యయనమే జీవితంగా, రాయడమే లక్ష్యంగా సాగిన బాల శ్రీనివాసమూర్తి వేలాది పేజీలను ఎడిట్ చేసి ప్రూఫ్ లు చూసి ప్రచురణ కర్తలకు గొప్ప భరోసానిస్తూ ఉండేవాడు. అధ్యాపనం ఆయన ఇష్టక్రియ. తెలంగాణ యూనివర్సిటీలో పరిశోధన విద్యార్థులకు సరియైన దిశానిర్దేశం చేయడంలో బాల శ్రీనివాస్ సర్ ను మించిన వారు లేడంటారు. స్నేహానికి, ప్రేమకు, ఆత్మీయ పలకరింపుకు ఒక స్థిర చిరునామాగా నిలిచిన బాల శ్రీనివాస మూర్తి 1966 సెప్టెంబర్ 5 న సిద్ధిపేటలో గొప్ప విద్వత్ కుటుంబంలో జన్మించాడు.

అన్ని వేగాలనూ, స్వయంకృషితో అందుకున్న బాల శ్రీనివాస్ కాలం పన్నిన వలలో చిక్కిపోయాడు. 24.04.2023 న ఈ లోకం విడిచివెళ్ళిపోయారు ఆయనకు నా అశ్రు నివాళి! ❊

# ఎందరో శ్రీనివాస్‌లు కావాలి...

- హరి

ధనుస్సు అవసరం లేని, స్వయం చోదితశరం లాంటివాడు శ్రీనివాస్, ఈ తరం ఉత్తమ లక్షణాలన్నింటికీ అక్షరాలా అతడొక ఒక ముఖ్య మైన ప్రతీక, 'ఏక సైనిక' సంస్థ (కవిత్వం ప్రచురణలు) గా నిలిచి తనకు నచ్చిన మంచి కవిత్వాన్ని అచ్చువేశాడు, 'మో', స్మైల్, గాలి నాసరరెడ్డి, రఘునాధం, అజంతా... ఇంకా కొందరు యువకులు... రాసిన కవిత్వాన్ని ప్రచురించాడు. ఈ సందర్భంలో చిన్నా, పెద్ద, కీర్తి మొదలైన అంశాలను గణించనే లేదు. ఈ తరం, ఇంతకుముందు తరం.. స్పందించి రూపొందించిన కవితాలోకాన్నే అతను ఆవిష్కరింపజేశాడు. స్థూలంగా ఈ నేలపై విరబూసిన ప్లూరలిస్టిక్ కవితల్ని ఫోకస్‌లోకి తెచ్చాడు. ఈ భారాన్ని బహిరంగోద్యమంగా స్వీకరించాడు. "రహస్యోద్యమం"తో తనకున్న సాన్నిహిత్యాన్నీ, హంసపాదులనూ.. మళ్ళీ 'అడ్డగోలుగా' 'దబాయింపుతో"... విరజిమ్మాడు. ఇన్ని అచ్చువేసి ... ఎన్నో ఆశలు కల్పించాడు. ఎన్నెన్నో అసాధ్యమైన పనులు చేశాడు...



అతను సంపాదకత్వం వహించిన "ఆంధ్ర జ్యోతి" (ఆదివారం సంచిక) 5,6 సంవత్సరాల పాటు సంచలనం. ఉప్పెనలాగా విరుచుకుపడుతున్న దళిత స్త్రీ వాద భావజాలాలకు ప్రధాన వేదిక అయింది. ప్రక్రియాపరమైన ప్రయోగాలకు (ఉదా: పతంజలి 'ఒక చెయ్యం ఆత్మకథ' ఆహ్వానం పలికింది. "చిన్న" కథలపై పెద్ద చర్చలను నడిపింది. (కొన్ని అపస్వరాలు సహజంగా వుంటాయి పరే!) కవితావైవిధ్యాన్ని ప్రదర్శించింది. ప్రధాన స్రవంతి (అదోపేరు మాత్రమే)కి చెందిన భారతీయ పత్రికా ప్రపంచంలో... ఎక్కడా... ఈ పనుల్లో పదోవంతైనా కనబడదు. ప్రస్తుతం భావజాలాలరీత్యా ... సంకుల సమరంలాంటి సుదీర్ఘమైన చర్చలు సాగుతున్నాయి. స్తబ్ధత ఉన్నట్టు కనబడినా.... స్తబ్ధతలోనో లేదు. ఆ విషయానికి సాక్ష్యమే 'ఆంధ్రజ్యోతి' (ఆదివారం)లో చర్చలు, విప్లవోద్యమంలో కార్యకర్తగా పనిచేసిన శ్రీనివాస్... సాహిత్య కార్యకర్తగా కూడా రాతలతో ఉత్తేజాన్నిచ్చారు. రాళ్ళువేసి గాయాలూ చేశారు. ఈ చర్చ కొనసాగుతుంది.

అతను పనిచేసిన సంస్థల్లో సహజంగా ముఠాలుండేవి (ఉంటాయి) ఈర్ష్యలూ, కార్పణ్యాలూ, చిన్నసైజు కుట్రలూ ఉండేవి. శ్రీనివాస్ వాటికి దూరంగా.... కాదు, భిన్నంగా - ఒక వ్యక్తిగా ప్రత్యేకంగా వుండేవాడు. నిచ్చెనల (ఎక్కించ దానికి వచ్చే పనిముట్లు)కు అతడు దూరం. అయితే మనుషులకెప్పుడూ దూరం కాలేదు. అలా ఉండలేదు మరి! ఇదంతా అతి సహజంగా, సరళంగా జరిగిపోయేది. అతడంటే అసూయ పడ్డవాళ్ళు నాకు తెలుసు. శత్రుత్వం చూసినవారు కనబడలేదు.

భారతదేశ చరిత్రలో, ప్రపంచ చరిత్రలో మనం ఇప్పుడొక సంరంభపు ఆరంభంలో ఉన్నాం. సోకాల్డ్ సోషలిస్టు సమాజాలూ, రాజ్యాలూ కూలిపోయిన తర్వాత.. చరిత్రకూ, సిద్ధాంతాలకూ, సెలవు పెడుతున్న) కాలంలో ఉన్నాం. బహుళా... ఇప్పుడు నిజమైన మానవ చరిత్రను పునర్నిర్మించుకోవాల్సి వస్తుంది. విశ్వమానవ సౌభ్రాతృత్వమనే భావానికి స్పష్టమైన రూపాన్ని ప్రాతిపదికను నిర్దేశించుకోవలసి ఉంది.

ఈ పని ఏంగెల్స్ చెప్పినట్టు "ఏ ఒక్కడో ఇద్దరో" నిర్ధారించలేరు. శ్రీనివాస్ లాంటి వారి ఉత్సాహం ప్రమేయం - నిజానికి ఎందరో శ్రీనివాస్‌లు కావాలి. ❄

# శ్రీనివాస్ ఒక 'ఆల్టర్నేటివిజం'

**- గుడిహాళం రఘునాథం**

ప్రపంచానికి అసలు సిసలైన శత్రువు త్రి. శ్రీ. అతని జీవితం, కవిత్వం, ప్రతి ప్రతీకా అందుకాధారం. 'నిషేధించిన అక్షరం' మీదే అతని మోజు. ప్రతిక్షణమూ ప్రపంచంతో తగాదా పడతాడు. చట్రాలను ఈసడించుకుంటాడు. అధికారాల్ని ధిక్కరిస్తాడు. తానెవరికీ భక్తుడు కాడు. మరొకరిని కానివ్వడు. ఆంక్షల్ని విధించడు. తనపై ఆంక్షల్ని సహించడు. జీవితంలోనైనా రచనలోనైనా నిజం చెప్పటం ముఖ్యం". అందుకే మాటల చాటున దాక్కోడు, తానే మాటై మనల్ని కదిలిస్తాడు. జీవితం చాలా క్రూరమైంది. ఎలాంటి ధీరుణ్ణైనా, క్రమక్రమంగా జవసత్వాలు లేనివాడిగా, కేవలం బతుకుసీడ్చేవాణ్ణిగా మారుస్తుంది. శ్రీనివాస్ ఇందుకు మినహాయింపు. వంద జీవిత కాలాలకు సరిపడే ఉత్సాహం అతనిది. దురదృష్టవశాత్తూ ఉన్న జీవితాన్నే సగంలో వదిలేసి వెళ్ళిపోయాడు.



మనిషిని ఎంతగానో ప్రేమించాడు. వ్యవస్థలకు శత్రువయ్యాడు. వివాహ విషాన్ని తిరస్క రించాడు! విప్లవ తీర్థం పంచే పూజారుల్ని ద్వేషి ంచాడు. విప్లవాన్ని ప్రేమించాడు. అది, పాతమూసల్లో సాధించే విప్లవం కాదు. మూసల్ని భళ్ళున బద్దలు కొడుతూ ధ్వంసం చేస్తూ సాధించే విప్లవం - విప్లవం - in every aspect.

విశ్రాంతంగా బతకడు. అక్షరాల్ని ప్రశాంతంగా ఉంచడు. తుపానై విరుచుకుపడతాడు. అక్షరాల్ని మందు పాతరల్ని చేసి పేల్చాలనుకుంటాడు. మనల్నీ అదే పని చేయమంటాడు. నిజమే! శాంతంగా బతకాలనుకునేవాళ్ళు సముద్రాలు కాలేరు. ఎవరి సంకలనాలు వాళ్ళేసుకోవటమే గగనమైన కాలంలో ఆదోపనిగా, దీక్షగా పుస్తకాలు అచ్చేశాడు. త్రిశ్రీ 'కవిత్వోద్యమ' కార్యకర్త కూడా!

శ్రీనివాస్ మంచి అందగాడు. అతని జీవన విధానంలోని వైవిధ్యం అంతకంటే అందమైనది. అసూయపడేంత గొప్పది. అప్పుడే విడుదలైన తాజా కలలా ఉండేవాడు. తానెలా బతుకుతున్నాదో, మనమెలా బతికితే బావుంటుందో, 'ఆల్టర్నేటివిజమ్'లో చూపించాడు. అభినందిద్దామనుకున్నాను. అందకుండా వెళ్ళిపోయాడు.

That's Sreenivas! ❋

# శీను..

**- చలసాని ప్రసాద్**

ఇంచుమించు నెలరోజుల క్రితం రాత్రి మూడుగంటల తరువాత ఫోనులో... "చలసానీ! నీ ఉత్తరం అందింది. ' పుట్టుమచ్చ 'కాపీ కావాలన్నావు. ఇప్పుడు నాదగ్గర లేదు. బేగంపేట నుంచి మాట్లాడుతున్నా. ఈసారి హైదరాబాద్ వచ్చినప్పుడు ఇక్క డికేరా. నాదగ్గరే వుండు, ఎన్నాళ్ళయినా సరే అంటూ చాలాసేపు సంభాషణ సాగించాడు. నెల రోజులు దాటకుండానే .... మళ్ళా రాత్రి మూడు గంటల తరవాత ఫోనులో 'శీను చనిపోయాడని' షాకింగ్ వార్త. ఈ నెల రోజులుగా వాడిని గురించి ఆలోచించని క్షణం అనను గాని రోజుమాత్రం లేదు. శీను సొంతం నగర వాసి అయిపోయాడు. తాను పుట్టి పెరిగిన వేరు నుంచి వేరు పడిపోయాడనుకున్నాను. (he is compleatly up rooted from his soil) ఆధునిక నగర జీవితం ప్రసా దించే స్వేచ్ఛకివాడు అలవాటు పడిపోయాడు. అయితే, సాహ చర్యం మాత్రం కడవరకు కొనసాగించాడు.



తెలుగు కవితా లోకంలోకి ప్రవేశించిన తొలిదశలో వాడు 'రె దేవేవ్' అనే పేరుతో కొన్ని కవితలు రాశాడు. చివరి దాకా 'వేవ్' లాగానే తన మనుగడ సాగించాడు. ఈ విషయంలో వీడిని ఆలూరి బైరాగితో పోల్చవచ్చు. అయితే బైరాగిలో కొరవడిన కార్య దక్షత శీనులో వుంది. అందుకని తెలుగు కవిత్వంలో కొన్ని 'నిర్మాణాత్మకమైన పనులు - ఒంటరిగానే చేశాడు. తెలుగు సాహి త్రీ లోకం శీనుని మర్చిపోదు.

శీనుకీ, నాకు వయసులో రెట్టింపు తేడావుంది. భావాల్లో అభిప్రాయాల్లో ఎన్నో రెట్ల తేడా వచ్చింది. అయినా ఇవేవీ నా ప్రేమానురాగాలకి అంతరాయం కలిగించలేదు. నన్ను చలసానీ అని చిలిపిగా, చనువుగా పిలిచే కొద్దిమందిలో శీను ఒకడు. వాడి చురుకు చూపు, కరుకుమాట, కొంటెనవ్వు, పసితనపు మొఖం ఎప్పటికీ మరుపు రావు. ఆ గుర్తులే నాలో మిగిలాయి. ❋

# అంత అందం ఎలా సాధ్యం?!

- హెచ్చార్కె

త్రిపురనేని శ్రీనివాస్ అంటే అందం. ప్రవర్తనలో ప్రతి కదలికలో కవిత్వంలో అంతటా పరుచుకున్నట్లుండే అందం. తనతో కాసేపు గడిపినా మనతో చిరకాలం ఉండిపోయే అందం. ఇంత సౌందర్యం తనకు ఎలా సాధ్యమయిందా అని ఆశ్చర్యం వేసేది. దానికి మూలం. తాను నిత్యం తొడుక్కునే రంగురంగుల వినయమే అనుకుంటాను. అది పెద్దలపట్ల పిన్నల నైతిక వినయం కాదు. జీవితం పట్ల జీవికి, జ్ఞానంపట్ల జ్ఞానానికి ఉండే అతి సహజ వినయం. కవులు అమాయక దుస్సాహసికులని అంటారు. అమాయకత్వం, సాహసం శ్రీనివాస్ రెండు కళ్ళు. శ్రీనివాస్ నాయకత్వం కన్న కార్యకతృత్వాన్ని కామించిన సాహసి. కవిత్వానికి కార్యకర్త కాదలచానన్నాడొక ఉత్తరంలో. ఆ వాక్యంలో సంచరించి ఔను కవిత్వానికి కార్యకర్తలుండాలి, హృదయానికి పక్కటెముక్కల్లాగా అని పలవరించాను. ఇప్పుడు శ్రీనివాస్ లేదు. లేదూ? మనుషుల హృదయాంతరాళాల్లో నిత్యంసాగే రహస్యోద్యమాలకు కాపలా కాస్తున్నదెవరు? ఎంత ప్రేమనిచ్చావు శీనూ! ఎన్నడయినా ప్రేమను కొలిచి ఇచ్చావా? నారింజ పండులా గుండెను ఒలిచి ఇచ్చావు గాని, ఎవరికీ ఇష్టమైనంత వారిని తీసుకోనిచ్చావు గాని, చర్మంలోంచి దూసుకొచ్చి లోక ద్వేషాన్ని నీ ప్రేమతో వెక్కిరించావుగాని. ఎంత ప్రేమ ఇచ్చావు. శీనూ! ఇక మా కదే దారి బత్తెం, మిగిలిన పయనాల్ని నిర్భయం చేసే చద్దిమూటా, నదీతీరం.

**(ఆగస్టు 18, 1996 సంస్మరణ సభలో ఒక కన్నీటి చారిక)** ❊

# మంచి చూపున్నవాడు

దేనికది విస్పష్టంగా తెలిసి స్వేచ్ఛానుసారం నచ్చిన కవిత మీద మనసు పెట్టి అచ్చు వేసుకోడం శ్రీనివాస్‌కి తెలుసు. వ్యాపారం తెలుసు. హాయిగా వుండటం తెలుసు. తనకు నచ్చిన పరిధిలో కవిత్వం విషయంలో నిర్వందంగా ప్రవర్తించడం తెలుసు. తనకి దమ్ములున్నట్టు తెలుసు. విరసానికి దూరమై నా ఉద్యమ నాయకత్వాలకి దూరంగా వున్నా తన నమ్మిక మీద అర ఇంచి కదలకుండా నిలవడం తెలుసతనికని మనకి తెలుసు. స్త్రీవాద కవితను, దళిత కవితను, హైకూనూ తగినది ఏరుకోగల మంచి చూపున్న వాడు శ్రీనివాస్. శ్రీనివాసో నాకు ఇంతే పరిచయం స్నేహం. చివరిసారి అలియన్స్ ఫ్రాంకయిస్‌లో బోరు సినిమా మధ్య హాలో పలకరించుకున్నాం పనిమీద హడావిడిగా వెళ్లిపోయాడు అంతే. ఆ తరువాత అలాగే వెళ్లి పోయాడు. కొందరంతే!

- శివాజీ

## అందుకున్నాం

❊ **స్వీయ చిత్రం;** మహేష్ కవిత్వం; పుటలు: 154; వెల: రూ. 200/–; ప్రేమలేఖ ప్రచురణ; ప్రతులకు: నవోదయ, అనేక పుస్తక కేంద్రాలు.

❊ **అన్నవరం దేవేందర్ కవిత్వం;** 1988–2022; పుటలు: 2000, వాల్యూమ్ 1&2; వెల: రూ. 1000/–; ప్రతులకు: నవచేతన, నవోదయ.

❊ **కాంతిధార;** లఘు రూప కవిత్వం; ఎమ్.కె. సుగమ్ బాబు; పుటలు: 78; వెల: రూ. 100/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **సొంత ఊరు;** కవిత్వం; వారాల ఆనంద్; పుటలు: 164; వెల:రూ. 150.

❊ **చిన్నోడి ముక్తకాలు;** కవిత్వం; వారాల ఆనంద్, పుటలు: 122; వెల: రూ. 75/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **మొలగొలుకు చేను;** కవిత్వం; శివకుమార్ పేరిశెట్ల; పుటలు: 131; వెల: రూ. 150/– త్రులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **సూర్యచరితము;** పద్యకావ్యము; నూతలపాటి వెంకటరత్న శర్మ; పుటలు: 86; వెల: రూ. 100/–; ప్రతుకు: కవి సెల్: 9860376050.

❊ **మరోగ్రహం;** కవిత్వం; డా. టి. హిమబిందు; పుటలు: 110; వెల: రూ. 110/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **జమిడిక;** కవిత్వం; కందుకూరి అంజయ్య; పుటలు: 140; వెల: రూ. 100/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **కలలకు కాలం చెల్లింది;** కవిత్వం; శ్రీపాద స్వాతి; పుటలు: 136; వెల: రూ. 150/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **రఘానీ మజిలీ కథలు;** ట్రావెలాగ్, మధునాపంతుల సత్య నారాయణ మూర్తి; పుటలు: 89; వెల: రూ. 100/–; ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు.

❊ **కథామంజరి;** వాట్సప్ గ్రూపు కథల పోటీ బహుమతి కథలు; నిర్వహణ: సుధామ; పుటలు: 149; వెల: రూ. 180/–; ప్రతులకు: 9849297958

❊ **ఆసు;** కవిత్వం; డా॥ వెల్దండి శ్రీధర్; పుటలు: 138; వెల: రూ. 150/–; ప్రతులకు: 9866977741

❊ **తోబుట్టువులు;** కవిత్వం; గుదిబండి వెంకటరెడ్డి; పుటలు: 85; వెల: రూ. 100/–; ప్రతులకు: 9849882783.

❊ **కవితా!** సమకాలీన కవితల కాలనాళిక; 72, ఏప్రిల్ 2023, కార్య నిర్వాహక సంపా: శ్రీశ్రీ విశ్వేశ్వరరావు; పుటలు: 36; ఉచిత ప్రతుల కోసం: 9392971359 ❊

# అంటరాని దాన్నే...

- త్రిపురనేని శ్రీనివాస్

చీకట్లో దారి వినిపించదని
కళ్లు మూసుకున్నాం
చూపు లేదనే చూపుతో
చీకటే నెగళ్లు తెరిచి
తెల్లార్తో కూసాలు కూలుస్తోంది.

కులం చీకటే పట్టించుకోనంత
కాలం విస్మరిస్తే విడిలిపోతుందని
పేరులో సగాన్ని మర్చిపోయాం
సగం జీవితమూ మనల్ని
మర్చిపోయింది

యిప్పుడు గుర్తు చేస్తున్నది
యిక మరపు రానిది

వొద్దనుకుని వొదిలేసిన పదాలు
పాదరసం బిందువుల్లా కలిసిపోయి
కొత్త రచనలు మాట్లాడుతున్నాయి

వుపన్యాసాలు కట్టిపెట్టి సంభాషిస్తే
పలుమార్ల పరిచయస్తులం

మన ఆలోచనల్లో ఖాళీలున్నాయి
పూరించటానికి వాడవాడలా
దుమారం
పుట్టుక నేర్పింది మనమే మన
వైఫల్యమే

తల్లిదండ్రులం మనమే కావచ్చు
పేటెంటు హక్కులు కావాలా?

వాడల్లోనే వొయసుల్నొదులుకున్నాం
యెదురెదురు ప్రవాహాలమై లోతుల్ని
కొలుచుకున్నాం
కానుకోవాల్సినదాన్ని కానుకోలేక
పోయాం

యిప్పుడు కన్నబిడ్డలే కాదు
పొమ్మంటుంటే
హారర్ సినిమా ఫిల్ము ముక్కలు
గుచ్చుకుంటున్నయి

యింకాస్త తాత్వికంగా
వూహిస్తున్న సందర్భం
కోతల సమయం వొచ్చిందని
కోల్తల చేస్తుంటే
కొడవలి మాటున కంకిలా
వులికి పడుతున్నాం.

యుద్ధం మనమీద కాదు
మనది కూడా
అంటరానిదాన్నే అంటుకుందాం
అపూర్వంగా పరస్పరం
ఆలోచన మీద సాము
కవిత్వం వుభయచరం
ముగింపు బహుజనముఖం ❊



VPVMOLAMH

KAVISANDHYA-42 MAY-JUNE, 2023 Rs. 50/.

# కవిత్వం ప్రచురణలు































Published and Owned by Dr. K. Sanjeeva Rao (Shikamani) and Printed at Rainbow Print Pack, Hyderabad. Published at Kavi Sandhya, #2-1-043, Ambedkar Nagar, Yanam-5233464, Editor- Dr. Sikamani

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | VPVMOIAVDH |
| పుస్తకం పేరు | కవి సేనాని |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |